ఈ సంపుటిలో:

పద్మరాణి

శావలిని

జానకి ఆవేదన

వెలయాలి అబద్ధాలు

—...—

రచనాకాలం:

పద్మరాణి 1921

మిగతావి 1926 ప్రాంతాన

# పద్మరాణి

## పాత్రలు :

నర్మదరాణి : రాణి

విక్రమవర్మ : } నర్మద తమ్ములు
సరసవర్మ : }

ఉద్దండుడు : సేనాధిపతి

అభయవర్మ : యువరాజు, నర్మద కుమార్డు

పద్మరాణి : ఒక రాజ పుత్రిక
అభయవర్మ స్నేహితురాలు

సగరరాజు : ఒక రాజ కుమారుడు,
పద్మరాణి స్నేహితుడు

నలుగురు సేవకులు :



పెద్దహాలు, రెండు సోఫాలు, పది కుర్చీలును, మధ్య గుండ్రని బల్ల, గోడపై కత్తులు, బాకులు, ఎలుగుగొడ్డు చర్మములు, పెద్ద పులి, చిరుతపులి చర్మములు, తలలు, పటములు తగిలింపబడి యున్నవి. ద్వారమువద్ద ఇద్దరుసేవకులు కత్తులతో నిలువబడి యున్నారు. నర్మద సోఫాపైన కూర్చున్నది. ఏబదిసంవత్సరము లుండును. కనుబడుటకు ఇంకా చిన్నదిగా వుండును. పొడుగు

గాను బలిసి యుండును. చురుకుగా ధాటీగా నడచును. మాట్లాడును. నలిగిన వస్త్రములను నిర్లక్ష్యముగా ధరించును. జుట్టు చిన్నది. నెరిసినది. ముడి వేసినది. ఈమె కెదురుగ కుర్చీలపై నిర్లక్ష్యముగ విక్రముడును, సరసుడును, కూర్చుని యున్నారు. విక్రమునకు ముప్పది సంవత్సరములు, కోరమీసములు, దుష్టునిముఖము. సరసునకు ఇరువదియైదు సంవత్సరములు, విక్రముని బాసుడు. విక్రముడు కత్తి పదును చూచుచు మాట్లాడుచున్నాడు. సరసుడు మీసములు మెలివేయుచు అటు నిటు చూచుచు మాట్లాడుచున్నాడు. వీరికి దూరముగ ఉద్దండుడు కుర్చీపీటపై కూర్చున్నాడు. ముప్పదియైదేండ్లు. పొట్టిగ లావుగ నుండును. ఒరతీసిన కత్తిని పక్కనుంచుకొని కాగితముమీద లెక్కలు వేయుచున్నాడు. నర్మద మాట్లాడినప్పుడెల్ల ఆదిరి తలయెత్తి తనతో మాట్లాడినట్లె చూచును. కాని ఇంకెవరు మాట్లాడినను చూడడు. అతి వినయము. నర్మద మాటి మాటికి వాకిలివైపు చూచుచున్నది.

నర్మద:

వస్తోందిగావును అమ్మగారు.

విక్రమవర్మ:

అప్పుడే? వస్తారు మెల్లిగా, తొందరా యేమన్నానా ?

సరసవర్మ:

దానితండ్రి వస్తున్నాడా యింతకూ?

నర్మద:

ఎబ్బే. తండ్రెందుకూ, ఏం చేతగాని మొగాడు? ఎందుకైనా ఇది వుండాలిగాని?

విక్రమవర్మ:

మనకే యిట్లావుంటే? కూతురిట్లా తిరుగుతూవుంటే, ఆ తండ్రి కెట్లావుందో!

నర్మద:

దీన్ని కన్నతండ్రిగనక నే యింకా బతికివున్నాడు, కాని ఇంకొకడయితే—

సరసవర్మ:

ఎంతమంది దీన్ని వలచి చచ్చింది?

నర్మద:

దాన్ది గుండెకాదు, రాయి.

సరసవర్మ:

యీ మొగాళ్ళమాట చెప్పు? ఆ శిఖండిలో అందం వీళ్ళకేం కనపడ్డదో, దానికోసం, ప్రాణాలమీద ఆశ వదులుకోడానికి?

నర్మద:

రాను రాను కాలం యీ ప్రకారం మారుతోంది.

విక్రమవర్మ:

నిజంగా వస్తుందంటావా?

నర్మద:

రాకేంచేస్తుంది? జోడుతీసుకొని బుద్ధిచెప్పే మొగాడు లేక పోయింతర్వాత? ఇందరు రాజులున్నారు, ఒక్కడికి ధైర్యముందీ, ఇదేమిటి ఆడకూతు రిట్లా అచ్చుపోసినట్లు తిరగడమని!

సరసవర్మ:

ప్రతివాడూ కుక్కలాగ ఆ పద్మరాణి నోట్లోంచి వచ్చే

ప్రతిమాటకూ, "అహహ" అనుకుంటో వెంట తిరగడమే తప్ప—

విక్రమవర్మ:

ఇప్పుడీ జాడ్యం మన అభయుణ్ణి పట్టిందికద-!

సరసవర్మ:

కాదులే, అభయుడట్లా తలతిరిగే మనిషి కాడు, ఏదో చిన్నప్పటి స్నేహంచేత పిలిచాడేగాని—

విక్రమవర్మ:

ఇందరం మొగాళ్ళముండగా ఆ ఆడదాన్నే పిలవాలి వేటకి?

సరసవర్మ:

అవును నిజమే! ఇక్కడికి వచ్చేముందు ఆ పద్మరాణి యింట్లో ఆరెళ్ళున్నాడు, చాలదూ?

నర్మద:

ఉంటేనేం, వాడికి తక్కువయిందేమిటి? మొగాళ్లు యెప్పుడూ యింటిదగ్గిర పడుంటారా? ఆడదానికి సిగ్గూ భిడియం వుండాలి గాని—

విక్రమవర్మ:

అయితే మాత్రం నిన్నుకూడా చూడకుండా, అంత మాత్రం తల్లేమయిందో, భార్య ఏమయిందో, రాజ్యం ఏమయిందో అని ఆలోచనన్నా లేదు సరేగదా—

నర్మద:

నేను 'సరే' అన్నాను గనక! లేకపోతే అభయుడు నేను గీసిన గీత దాటతాడా? వాడు నామాట నిర్లక్ష్యంచేస్తే నేను బతుకుతానా? వాడుగాక నాకు లోకమేముందీ?

అవన్నీతీసి అవతలపెట్టు. తల్లిని ఆదరించడంలో అభయుడి తరవాతే !

సరసవర్మ:

అతని పరాక్రమం ఔదార్యం యీకాలంలో ఎవరికున్నా యిలే ? అతన్ని కన్నతల్లివై ధన్యురాల వైనావు.

నర్మద:

అవును. అందుకనే కదూ అందరికీ కళ్లుకుట్టు ? ఏ రాజ వంశంలో తల్లికీ కొడుక్కీ యింత శాంతంగా జరిగిపోతోంది? తెలివితక్కువదన్న మాటేగాని యేదీ, శారదను నోరెత్తి మాట్లాడమను నా ముందు? యీపద్మరాణి ఆటలు మాత్రం నాముందు సాగనిస్తానా ?

సరసవర్మ:

ఇంతకీ వాళ్ళకి ఫలహారాలు సిద్ధమవుతున్నాయా?

శారద ప్రవేశము, ఇరువది సంవత్సరముల వయస్సు. సన్నని వడలు, కోల ముఖము. మిక్కిలి మృదుస్వభావము. చాలా జాగ్రతగా అందమైన విలువగల దుస్తులు వేసుకొన్నది. మెల్లగా చప్పుడు కాకుండా వచ్చి నర్మద వెనుక కూర్చున్నది. ఆమె వచ్చినది తెలియనుగాని ఆమెవంక ఎవరును చూడరు.

నర్మద:

ఫలహారాలకేం ? ఏమోయి, వేటగాళ్ళని సిద్ధంచేశావా ? పద్మరాణిగారు వస్తున్నారుట.

ఉద్దండుడు:

(ఉలికిపడి నిలుచుని చేతులు నలుపుకొనుచు, తెల్లపోయి) చిత్తం, చిత్తం.

నర్మద:

ఆడదానిచేత మొట్టికాయలు తినే ఖర్మం పట్టింది లెండి మీకు.

ఉద్దండుడు:

చిత్తం, చిత్తం, తమ దయవల్ల.

నర్మద:

నాదయవల్ల యేమిటి?... ఏమిటి ఆలోచిస్తున్నావు?

సేవకుడు:

యువరాజుగారూ వారూ వస్తున్నారు.

ప్రవేశము అభయవర్మ. పక్కన పద్మరాణి ఆమె వెనుక సగర రాజు. అభయునకు ముప్పది సంవత్సరముల వయస్సు. అంద మైనవాడు. శూరుడు. పద్మరాణికి ఇరువది ఎనిమిది సంవత్స రములు. ఆజానుబాహువు. మిగుల అందమైనది. మొగవాని దుస్తులు. చేతిలో బల్లెమ్మున్నది. వచ్చుటతోడనే బల్లెమును సేవకు నకు అందిచ్చును. సగరరాజు పదునెనిమిది సంవత్సరముల బాలుడు. మీసములు లేవు. ఎప్పుడు నవ్వును. కొంటె. నర్మద మాత్రము లేచి ద్వారముదగ్గరకు వచ్చినది. అభయుడు నర్మదకు నమస్కారము చేసినాడు.

అభయవర్మ:

ఈమె పద్మరాణి. యీమె మాతల్లి.

నర్మద ఒకనిముషము తెల్లబోయి, తెప్పరిల్లి, తేరిపారచూచి పద్మ రాణి చెయ్యిపట్టుకుని చిరునవ్వుతో సోఫావద్దకు మాట్లాడుచు తీసు కొనిపోవుచున్నది. సగరరాజు వెనుకనే వెళ్ళుచున్నాడు. అభయుడు ద్వారమువద్ద సేవకున కేదో ఆజ్ఞాపించుచున్నాడు. ఉద్దండుడు



లేచి, ఆతురతతో, నోరుతెరచి ఎవరైన తనతో మాట్లాడుదురేమో నని చూచుచున్నాడు.

సోఫామీద నర్మద, పద్మరాణి, కూర్చునుచున్నారు. సగరరాజుకు చోటులేదు. సగరరాజు పద్మరాణిని జరగమని పక్కన ఇరుకు చున్నాడు. నర్మద సగరరాజును కోపముతో చూచుచున్నది. సగరరాజు ముఖము తిప్పుకొని నవ్వుచున్నాడు. పద్మరాణి లోపల నవ్వుకొనుచున్నది.

అభయుడు చుట్టునుచూచి శారద కనబడగా అటుపోవుచున్నాడు.

నర్మద:

అభయా! ఈతన్ని ఫలహారానికి తీసుకొనివెళ్ళు.

అభయుడు:

ఫలహారాలు రానీ.

అభయుడు శారద ప్రక్కకువెళ్ళి కూర్చుని, చెయ్యిపట్టుకొని, చాల ప్రేమతో మాట్లాడుచున్నాడు. శారద మెల్లగా సిగ్గుతో నవ్వుచూ మాట్లాడుచున్నది. విక్రమవర్మ, సరసుడు, గుసగుస లాడుచున్నారు. ఉద్దండుడు అందరివంకను త్వరత్వరగా చూచు చున్నాడు.

నర్మద:

మన స్త్రీజాతికంతా కీర్తి తెచ్చిన పద్మరాణిని చూసే భాగ్యం ఈనాటికి నాకు కలిగింది. మీ కీర్తి, విద్యలూ, ధైర్యమూ, వినడమేగాని, ఎన్నిసార్లు చూద్దామనుకొన్నా పడింది కాదు.

పద్మరాణి:

నావంటివాళ్ళను చూస్తే, మీ కాలంవాళ్ళకి కోపమనుకొన్నాను?

నర్మద:

సరి, సరి. కోపమా? ఎందుకుకోపం? కోపమైతే మాత్రం ఎవరికి లెఖ్ఖ?

పద్మరాణి:

లెఖ్ఖలేదు లెండి, కాని ఆ సంగతి ముసలవాళ్ళకు చాల మందికి తెలియదు.

నర్మద:

(కోపము అణచుకొనుచు) నేనంత ముసలిదాన్నా?

పద్మరాణి:

మా సగరరాజు నన్నే ముసలిదాన్నంటాను!

సగరరాజు:

ఏమిటి... నేనా... చూశారా?

సేవకులు ఫలహారములు తెచ్చి బల్లమీద పెట్టుచున్నారు.

నర్మద:

అభయా! ఫలహారానికి కూర్చోండి. ఈయన్ని తీసుకువెళ్లు. చాలా ఆకలిగా వుంటుంది ఈయనకి.

సగరరాజు:

లేదు, లేదు. పద్మరాణి ఆకలంటోంది ఇందాకట్నించి.

అభయుడువచ్చి సగరరాజును చెయ్యిపట్టుకొని తీసుకవెళ్లును.

పద్మరాణి:

నేనో.

అభయవర్మ:

నువ్వూ అమ్మాతో,

సగరరాజు పద్మరాణివైపు దీనముగా చూచుచున్నాడు. పద్మరాణి నవ్వుచూ సగరరాజు బుజము పట్టుకొని లేచుచున్నది.

నర్మద:

ఎక్కడికి?

పద్మరాణి:

సగరరాజుతో ఫలహారానికి.

నర్మద:

మొగవాళ్ళైయుం తరవాత మనము,

పద్మరాణి:

మొగవాళ్ళకంటె ఎక్కువ ఆకలి నాకు. సగరా, పోనీ, నువ్వెక్కడ కూచో నా ఫలహారం అయిందాకా. ఆకల్లో దహ్నాపుగా.

వెళ్ళుచున్నారు. నర్మద చాల కోపముతో చూచి, తనూ వెనుక వెళ్ళుచున్నది. విక్రముడు నవ్వుచున్నాడు. నర్మద, శారద తప్ప తక్కిన వారందరు ఫలహారము చేయుచున్నారు.

పద్మరాణి:

ఇంతకూ ఎప్పుడు బయలుదేరడం?

విక్రమవర్మ:

రేపు తెల్లారకట్ట!

పద్మరాణి:

పెద్దజంతువు లున్నాయా యేమన్నా?

విక్రమవర్మ:

కావలసినన్ని. ఇట్లాంటి అడివి యే దేశంలో వుంది! మహారాజుకి వేటంటే చాలా యిష్టంగా వుండేది. పైనుంచి మృగాల్ని తెప్పించి, దానిలో వొదిలారుకూడాను.

సరసవర్మ:

ఈ సింహంమాత్రం, చాలా విచిత్రమయింది.

విక్రమవర్మ:

ఏదో, దేవత అంటారు, ఆ కొండవాళ్ళంతరూ.

అభయవర్మ:

దేవతకాదు దెయ్యం.

పద్మరాణి:

దెయ్యాన్ని వదిలిద్దాం రేపు.

నర్మద:

నువ్విక్కడ రెండురోజు లుండకూడదమ్మా? ఆడదానవు వేటకంత తొందర పడకపోతే?

అభయవర్మ:

వేటనుంచి వచ్చిం తరువాత నాలుగు నెల్లుంటానని యిది వఱకే వొప్పుకుంది.

నర్మద:

ఏం మాటల్లే. ఆమె వుంటుందీ మనవంటివాళ్ల యిళ్ళల్లో? ఆమె తండ్రిగారు వుణ్ణిస్తారా?

అభయవర్మ:

ఆమెతండ్రిగారిని వప్పించే తీసుకొచ్చాను.

నర్మద:

అయినా, ఆమె కిక్కడేంతోస్తుంది? ఎందుకుంటుంది?

లేచుచున్నారు.

సగరరాజు:

ఈ బట్టలు వెంటనే మార్చుకోకపోతే బతికేది కష్టం.

అభయవర్మ:

విడిది చూపిస్తాను రా.

పద్మరాణి అభయుని చెయ్యిపట్టుకొని వెళ్లుచున్నది.

నర్మద:

పద్మరాణి నెక్కడికి తీసుకెడతావు?

సగరరాజు:

నాతో విడిదికి.

నర్మద:

బాగానేవుంది! అక్కడ మొగాళ్ళతో, వేటగాళ్లతో, ఎట్లా వుంటుంది? నీకు అంతఃపురంలో ఏర్పాటు చేశామమ్మా.

సగరరాజు పద్మరాణిచెయ్యిని అదుముచున్నాడు.

పద్మరాణి:

ఛా... అంతఃపురంలో ఎవరుంటారు? ఆ దాసీల్లో, పసుపు కుంకాల్లోను. అదిగాక, సగరరాజు కూడా నాతో వుండాలి.

నర్మద:

ఇదేం ప్రారబ్ధం?

అభయవర్మ:

నీకేం కష్టమిప్పుడు?

నర్మద:

బాగానేవుంది నాటకం!

శారద ఆశతో అభయునిసంక చూచుచున్నది. అభయుడు అనుమానముతో రమ్మని సంజ్ఞచేయుచున్నాడు. శారద మెల్లగా వారివైపు నడచుచున్నది.

నర్మద:

నువ్వెక్కడికి?

అభయవర్మ:

మాతోనే వొస్తుంది.

నర్మద:

ఏమిటి? ఏమిటి? శారదనే! బయటికి! నీకేం మతిపోయిందా?

అభయుడు:

శారదా ——

నర్మద:

నువ్వు వెళ్ళడానికి వీల్లేదు. వెళ్లు చూస్తాను. మళ్ళీ యింట్లోకి ఎట్లా వస్తావో,

శారద అనుమానముతో నిలుచున్నది.

అభయవర్మ:

నీ యిష్టం వస్తే రా.

శారద వెనక ఆగినది. అభయుడు, పద్మ రాణి, సగరరాజు నిష్క్రమించుచున్నారు.

నర్మద:

నీ పని యింతవరకొచ్చిందీ ? వీధులెంబడి షికార్లే? నీ పని

మిటయితేనేం, ఎవరయితేనేం, నాకు భయమనుకున్నావా? ఎవరో యిక్కడున్నది చూచుకు తిరుగు, యీ పాటికి యింట్లోకిపో.

తలయెత్తక విని శారద మెల్లగా లోపలికి పోవుచున్నది.

సరసవర్మ:

మన మనకున్న దానికంటె మించింది.

నర్మద:

చూశారా దానివేషం.

సరసవర్మ:

శారదని తీసుకురమ్మని పురిగొల్పిం దెవరనుకుంటారు ?

విక్రమవర్మ:

అభయుడికి పుట్టిందే లెద్దూ ? వాడికిమాత్రం బుద్ధుండక్కర్లేదూ ?

నర్మద:

వాడి మాటల ధోరణి చూశారుకదూ ?

సరసవర్మ:

అతనికి మతిపోయింది.

విక్రమవర్మ:

పెళ్ళి అయిపోయింది గాని లేకపోతే-

నర్మద:

ఇప్పుడు మాత్రం మించిపోయిం దేముంది ?

సరసవర్మ:

ఆ సగరరాజో ! వాడికి మతిపోయింది.

నర్మద:

ఆ వేషం, ఆ పొగరు, ఆ నవ్వులు, — ఇఘ దీన్ని చూసి శారదకూడ మొదలు పెడుతుంది.

సరసవర్మ:

లాగూ-చొక్కా వేస్తుందంటావా యేమిటి?

నర్మద:

వీధుల్లో తిరిగేది లాగూలు మాత్రం వెయ్యదా యేమిటి?! దానిదూకుడూ, వదరుబోత్తనం! మొగాళ్ళ వీపు చరుస్తుంది కొరడా తీసుకొని. యిదేం హాస్యోకాలం నీకని తెర వెనక్కి పరిగెత్తిందాకా తగిలిస్తే!

సరసవర్మ:

అది చేశేవాడుంటే ఇంకేం? అదే కొడుతుంది మొగాళ్ళని.

విక్రమవర్మ:

అందుచేత ఆడవాళ్ళకి బలంలేకుండా చేశాడు దేవుడు... దీనికితప్పు.

ఉద్యానవనము. వెన్నెల. చెట్లనీడ ప్రక్కన తోవలో అభయ వర్మ, శారద మెల్లగ నడచుచున్నారు. శారద తలలో పువ్వులు పెట్టుకొన్నది. ఆమె నడుముచుట్టును అభయుడు చెయ్యివేసి మాట్లాడుచున్నాడు. శారద తలవంచుకొని, అప్పుడప్పుడు అతని వైపు చూచి మాట్లాడుచున్నది.

అభయవర్మ:

అమ్మ పెద్దది. చెప్పి లాభమేముంది?

శారద:

అయితే నాగతింతే? మీకేం మొగాళ్ళు తప్పించుకు తిరుగుతారు.

అభయవర్మ:

నువ్వుకూడా తప్పించుకు తిరగడం నేర్చుకోవాలి. నీ కోసం కూడా నన్ను అమ్మతో తగాదా పెట్టుకోమంటే?

శారద:

నాకూ ఆమెకూ సంబంధంలేకుండా చెయ్యండి.

అభయవర్మ:

చేసుకో. నన్ను చెయ్యమంటూ వెంచుకూ ప్రతిదీ! నేనేమన్నా నిన్ను అభ్యంతర పెట్టానా ! నేను అట్లా నిన్ను ఆవిడకు లొంగమన్నానా!

శారద:

నాకు చాతయితే ఇంత బతిమాలడ మెందుకు! అంతమాత్రం సహాయం చెయ్యకూడదేం?

అభయవర్మ:

చెయ్యికూడదని కాదు. నేను స్పృహాగా ఆమెకు విరోధపడ్డ మెందుకు? అదుగో పద్మరాణి వస్తోంది.

శారద:

పద్మరాణే! ఎంత అందంగావుందో ... తెల్లవారకట్టేనా ప్రయాణం? మళ్ళీ ఎప్పుడొస్తారో కదా?

అభయవర్మ:

(నవ్వుతూ) అసలు వస్తారో రారో అను!

శారద:

అదీనిజమే. అడివిజంతువులతో ఆటా మరి!

అభయవర్మ:

(నవ్వుతూ) లేకపోతే, నాటకంలోలాగు "నాథా, ఈ కన్నులకు తిరిగి మీ దర్శనమబ్బు భాగ్యమెప్పుడో కదా?" అను.

అభయుడు శారదమీద చెయ్యి తీయుచున్నాడు. ప్రవేశము పద్మరాణి, సగరరాజు. పద్మరాణి చీర కట్టుకొన్నది. జుట్టు వదులుగా అల్లి జడ వేసినది. నగలు లేవు. పొట్టిగాటి ఆహారము వేసుకొన్నది.

అభయవర్మ:

యీమే శారద. నా యజమాని. మీ చేతు లింతలేతగా కనపడతాయేగాని, ఇంత గట్టి సంకెళ్ళెక్కడా లేవు.

పద్మరాణి శారదను కౌగలించుకొని ముద్దు పెట్టుకొన్నది.

పద్మరాణి:

ఈ పురుషసింహాన్ని కట్టేసే శక్తివున్న శారదను స్వయంగా

చూడ్డానికే వచ్చాను. ఇందాక మాట్లాడదామన్నా వీల్లేక పోయింది. మాయింట్లో విధిలేక వున్నాడన్న మాటేగాని శారద స్మరణతో మా అందరికీ విసుగెత్తించాడు.

శారద:

ఈ స్త్రీసింహాన్ని కట్టేసేవాళ్ళు లేరుగావును?

పద్మరాణి:

లేతసంకెళ్ళ మంత్రం నాదగ్గిర పారదు. స్త్రీనిగనక, ఇనప సంకెళ్ళు నాకు వేసేవాడు పుట్టలేదు.

శారద:

ఇంకా అనేకమోస్తరు సంకెళ్ళున్నాయి.

పద్మరాణి;

వేటిభయం లేదు నాకు.

శారద:

సమయం వస్తేసరి ... చూద్దాంకదూ ... అరుగులమీద కూచుందాం, రండి.

అభయుడు, శారద, పద్మరాణి చేతులుపట్టుకొని, వరసగా నడచు చున్నారు.

సగరరాజు:

నన్ను మరచిపోయినారు కదూ!

అభయవర్మ:

లేదు లేదు. ఇట్లా రా.

పద్మరాణి;

వెళ్ళావనుకున్నా, ఉన్నావూ?

సగరరాజు:

నీడ వొదులుతుందా?

పద్మరాణి:

ఈ చెట్లనీడ చాలదూ?

సగరరాజు:

సరే, వెడతాలే.

పద్మరాణి:

కోపమే?

పద్మరాణి శారదను వదలి, సగరరాజు చెయ్యి పట్టుకొన్నది. అరుగు దగ్గరకుపోయి, ఒక అరుగుమీద శారద, పద్మరాణియును ఎదురుగ రెండవదానిమీద, అభయవర్మ, సగరరాజును, కూర్చున్నారు.

శారద:

ఎంతచేతులో; మొగాళ్ళకూడా యింత బలం వుండదు. మీ సంగతి, విన్నప్పుడల్లా నాకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది. మా అత్తగారు మీపేరు చెపితే మండిపడి పోతారు.

పద్మరాణి:

మఱి యీవాళ నన్ను చూచి జన్మం సాఫల్యమయినట్లు మాట్లాడింది?

శారద:

మీ ముందేమంటారు? ఆడదానికి వంటింట్లోతప్ప బయట పనిలేదుట. పరాయిమొగాడితో ఒక్కమాటకూడా పల

కూ్కడదుట. ఇంబాక చూశారా, మీాతో వస్తేవుంటే యేమందో!

పద్మరాణి:

మరి తను మాట్లాడుతుంది? అభయుడికూ్కడా ఆడవాళ్ళని యింట్లో కట్టేసే పిచ్చి వుందనుకోలేదు.

అభయవర్మ:

పూర్వకాలంవాళ్ళు. ఏంచేస్తాం, వాళ్ళవ్యూహాలు మారుతాయా?

పద్మరాణి:

నువ్వు మాత్రం చంటివాడవేం, వాళ్లు చెప్పినట్లల్లా వినడానికి? శారదను పెళ్ళిచేసుకున్నది నువ్వా; మీా అమ్మా?

అభయవర్మ:

ఎంతయుద్ధం చెయ్యాలో నీ కేం తెలుసు? కనిపెంచిన వాళ్లని యేడిపించడమంటే—

పద్మరాణి:

అదే వచ్చిన జబ్బు. మొగాళ్ళు వాళ్ళ సౌఖ్యంకోసం ఎంతన్నా పెద్దవాళ్ళని ఏడిపిస్తారు. భార్యసంగతి మాత్రం పెద్దవాళ్ళ పెత్తనం. నీకన్నా సిగ్గెయ్యటంలేదూ, అట్లా అన్డానికి? మానాయన యింకా నే నా దరిద్రుణ్ణి పెళ్ళిచేసుకుంటాననే ఆశపడుతున్నాడు. చేసుకోమంటావా?

అభయవర్మ:

రెండూ ఒకటెట్లా అయినాయిలే. ఇక్కడ అంత మునిగిపొయ్యే దేముందీ?

పద్మరాణి:

అవును, నీకట్లానే వుంటుంది. నీకేముందీ, పడేకష్టం శారద్ది గాని. నిన్న బైటికి వెళ్ళవద్దనరుగా వీరా అమ్మ! రేపు సగరరాజు చూడు, తనభార్యకు ఎంతస్వేచ్ఛ యిస్తాడో! నాకొప్పచెప్పేస్తా డంతే.

సగరరాజు:

నేను పెళ్ళి చేసుకుంటేకద!

అభయవర్మ:

ఈ వైరాగ్యమేమిటి? సన్యాసం పుచ్చుకుంటావా?

పద్మరాణి:

(లేచి సగరరాజు రెండు భుజములమీద చేతులువేసి అదిమి) ఏమమ్మా, ఎన్నిదుఃఖాలు పాపం నీకు! ఈ లోకం ఎందుకని పిస్తోంది గావును, ఏం?

సగరరాజు:

నాదుఃఖాలు గుండెలేనివాళ్ళ కేంతెలుస్తాయి?

పద్మరాణి:

గుండె వుందోలేదో రేపు వేటలో చూద్దుగాని.

శారద:

ఆ గుండెసంగతి కాదు ఆయన అనేది పాపం.

సగరరాజు:

పద్మకు తెలీకా! చుట్టుపక్కలవాళ్ళకు అందరికీ తెలుస్తుంది ఆమెకుతప్ప.

పద్మరాణి:

(నవ్వుచు) వెన్నెలగా వుందిగా, ప్రబంధోక్తంగా కొంచం తాపం కనపరిస్తేనేగాని రసం సరిపోదనా యేమిటి, ధోరణి అట్లాదించావు! పడుకో శాంతమవుతుంది.

సగరరాజు:

పడుకుంటే నిద్రవచ్చే అదృష్టముంటే యిట్లా చివాట్లెందుకు తింటాను? (వెళ్ళిపోవుచున్నాడు.)

అభయవర్మ:

సగరా.

పద్మరాణి:

వెళ్ళనీ, పిలిచి లాభంలేదు.

శారదలేచి సగరరాజువెనక వెళ్లుచున్నది.

పద్మరాణి:

శారదా!

అభయవర్మ:

పోనీ, ఆ మెననాన్న వెళ్లనీ, నీకేం తెలుస్తుంది, అతని బాధ! ఎప్పుడో నీకూ వస్తుంది, ఆ అనుభవం. అప్పుడు తెలుస్తుంది ఎంతమందిని ఎంత ఏడిపించావో!

పద్మరాణి:

రాదు. ఇది వచ్చేరకం కాదు. వస్తేమాత్రం వీళ్ళందరిమల్లే యేడ్చి, బాధపడి, ఇంకొకరి ప్రాణాలు తీస్తానా? చుట్టుపక్కల లేకుండా తరుముతాను దాన్ని.

అభయుడు లేచి పద్మరాణిప్రక్కన కూర్చునుచున్నాడు.

అభయవర్మ:

అందాకా అట్లానే అంటారు

పద్మరాణి:

నీకేదో మహా తెలిసినట్లు మాట్లాడుతున్నావు? నీకుమాత్రం ఏం తెలుసు ఆ బాధ!

అభయవర్మ:

శారద లేదూ?

పద్మరాణి:

శారదా! శారద వుంటేమాత్రం?

అభయవర్మ:

అయితే శారదమీద నాకు ప్రేమ లేదంటావా యేమిటి?

పద్మరాణి:

అదికాదుగాని, నువ్వెన్నా బాధపడ్డావా శారదకోసం?

అభయవర్మ:

అవుసర మేముంది?

పద్మరాణి:

అయితే ప్రేమ యేమిట్లే? కట్టేసింతరవాత, ప్రేమవుందనుకోక యేం చేస్తారు?

వెనుకనుంచి నర్మద ప్రవేశించి, కనపడక నిలుచున్నది.

అభయవర్మ:

నాకు శారదమీద ప్రేమవుంది.

పద్మరాణి:

నాకు ప్రేమవచ్చినప్పుడు, అతి తీవ్రంగా వస్తోందనుకుంటాను. ఏదో యిష్టముండడం ప్రేమ అనుకుంటూంటారు చాలామంది. ప్రాణం, స్వేచ్ఛా, గౌరవం, పాతివ్రత్యమూ అన్నిటినీ ఒకరి పాదాలదగ్గర పారెయ్యడం ప్రేమ. ఇంక లోకం ఏమయినాసరే, ప్రేమవుంటే చాలు. తల్లిదండ్రులయినాసరే, ప్రేమకు అడ్డంవస్తే పోవలసిందే. నేను నన్ను మఱచి ఇకోళ్లు అయిపోవాలి. నాకా అనుభవం వచ్చిందాకా ఎవరినీ పెళ్లిచేసుకోను.

అభయవర్మ:

నీకు యెవరిమీద ప్రేమవుందో అతనికి నీమీద ప్రేమ లేకపోతే?

పద్మరాణి:

లేకపోయినా, నా ప్రేమమారదు,

అభయవర్మ:

అతనికి పెళ్ళి అయిపోయివుంటే?

పద్మరాణి:

అయినాసరే అతనిదాన్నే. నన్ను పెళ్ళిచేసుకున్నా, చేసుకోకపోయినాసరే.

అభయవర్మ:

అవన్నీ నాకు తెలియవుగాని, శారదమీదతప్ప ఇంకెవరి మీదా నాకు ప్రేమరాలేదు.

పద్మరాణి:

ఆహా! ఎన్నడూ? మొగాళ్లు అట్లా కాదనుకున్నా!

అభయవర్మ:

కాని యీ మధ్య ...

పద్మరాణి:

ఏమిటి అనుమానిస్తున్నావు?

అభయవర్మ:

చెప్పనా వద్దా అని. నువ్వేమనుకుంటావో.

పద్మరాణి :

పోనీ వొద్దులే.

దూరంగా శారదవచ్చుచున్నది. క్రిందికి చూచుచు ఆలోచనలో సున్నది. నర్మద శారదనుచూచి వెనుకకు పోవుచున్నది. అడుగులు చప్పుడగుచున్నవి.

పద్మరాణి:

శారదా.

నర్మద ముందుకు వచ్చినది.

నర్మద:

ఏదీ? గదిలో లేదు. మాట్లాడాలని వచ్చాను.

పద్మరాణి:

అట్లావెళ్ళింది. యింకా రాలేదు.

శారద అట్లేవచ్చినది. నర్మదను చూడలేదు.

శారద:

ఎంత బతిమాలినా రాలేదు. పాపం అతన్నిచూస్తే చాలా జాలేస్తోంది.

పద్మరాణీ:

ఇంతసేపయిందేం?

శారద:

నన్ను తనతో కూచోమన్నాడు. నన్ను చూస్తే చాలా యిష్టంట తనకి.

నర్మద:

ఎవరు?

శారద:

(ఉలికిపడి) ఎ... వ... రూ... లే... రు

పద్మరాణీ:

సగరరాజు, ఇంకెవరూ లేరు.

నర్మద:

శారదా! నువ్వే, పరాయి మొగాడితో......

అభయవర్మ:

శారదా! అమ్మ నీతో పనివుండి వచ్చిందట వెళ్లు.

నర్మద:

నీతో నూ మాట్లాడాలి ఒకసారి రా.

అభయవర్మ:

పడుకు నేముందు వస్తాలే.

నర్మద:

ఇప్పుడు వీల్లేదు గావును. శారదా! నువ్వూ అప్పుడే రా. అందాకా ఇక్కడే వుండు. (నిష్క్రమించినది.)

శారద:

ఏమంటుందో?

పద్మరాణి:

ఏమంటుంది!

శారద:

మీ కేం హాయి. ఎవరూ అడిగేవాళ్ళు లేరుకదా!

పద్మరాణి:

అభయా, ఇంక యీ కష్టం శారదమీదినించి తప్పించక పోతే నాకు చాలా అసహ్యం వేస్తుంది. మధ్య ఆవిడ పెత్తన మేమిటి?

అభయవర్మ:

నిజమేగాని, ఏం చెయ్యను? ఇంతవఱకూ అధికారం ఆమె చేతులో వుండిపోయిింది. ఇప్పుడు ఒక్కసారిగా నాది నాకు ఇమ్మనడం కష్టంగా వుంది. అయినా తల్లిఋణం ఎన్నటికి తీర్చుకోగలం చెప్పు!

పద్మరాణి:

ఏమిటీపిచ్చి? ఏం ఋణం? తీర్చుకునేపద్ధతి యిదా? ఇట్లాంటి అధికారాలు సాగవనే జ్ఞానం తెప్పించడం అన్నిట్లోకి గొప్ప వుపకారం వాళ్ళకి. ఒక్కసారి కన్నాముగదా అని ఉన్నంత కాలం, సవారిచేస్తామంటే! ఎవరు కనమన్నారు?

అందరు కొంతసేపు ఊరక చూచున్నారు. గాలి వేయుచున్నది. చెట్లు కదులుచున్నవి.

శారద:

ఈవాళ రాత్రి చాలా బావుండకమా? నాకెందుకో సంతోషంగావుంది. పద్మరాణిని చూడ్డంచేతో, లేకపోతే సగర రాజుకి నన్ను చూస్తే బాగుండకంచేతో, ఎందుకోగాని.....

పద్మరాణి:

పాపం, సగరరాజు నిద్రపోతాడేమో! ముందు కోపం పోగొట్టాలి వెడతాను.

అభయవర్మ:

నిన్ను విడిచిదాకా వదుల్తాను. శారదా వెళ్ళు. ఇప్పుడే వస్తాను.

పద్మరాణి;

నన్ను వొదిలి పెట్టాలా? మీా వూరు వచ్చేటప్పటికి ఆడపిల్ల నయినా ననుకుంటున్నావా? నాకు భయమేమిటి?

అభయవర్మ:

ఆడదానవనే భ్రమపడతారు. చెయ్యి సత్తువ రుచిచూచిం తరువాతకద, వేషం వేసుకున్న భేతాళుడని తెలీసం!

శారద:

పద్మరాణీ, శలవు.

పద్మరాణి శారదను కౌగలించుకొని, ముద్దు పెట్టుకొనుచున్నది.

పద్మరాణి:

అత్తగారు అల్లరిచేస్తే నన్నుపిలు. అభయుడితో చెప్పి ప్రయోజనంలేదు.

శారద:

(నవ్వుచు) సరే, అందాకా అక్కర్లేదు. మీ పేరు చెప్పితే చాలు. (నిష్క్రమించుచున్నది.)

పద్మరాణి:

పాపం శారదను చూస్తే దిగులేస్తోంది.

అభయవర్మ:

ఏం?

పద్మరాణి:

ఏమోగాని ముళ్ళనడుమ పువ్వు లాగుంటుంది. ఎటుకదలినా గుచ్చుకోడమే.

అభయవర్మ:

నేనుకూడా ముల్లు నేనా?

నడచుచున్నారు

పద్మరాణి:

ముల్లువి కావుగాని, ముళ్ళనించి కాపాడవలసిన బాధ్యత నీది.

అభయవర్మ:

ఎప్పుడూ నేను కాపాడితే తనని తను కాపాడుకోడం నేర్చుకునే దెప్పుడు?

పద్మరాణి:

కొందరు ఎన్నటికీ నేర్చుకోరు.

అభయవర్మ:

నిన్ను చూడకముందు ఆడది మొగవాడిమీద ఆధారపడిన కొద్దీ ప్రేమ ఎక్కువ అనుకున్నాను గాని, ఇప్పుడు అట్లా

అనుకోను. స్వతంత్రతను, ఆత్మరక్షణము, ప్రతివారూ నేర్చుకోవాలి. నిన్నెవరు కాపాడాలి చెప్పు ?

పద్మరాణి:

అందుకనే నాకు ప్రేమ లేదేమో !

అభయవర్మ:

అయితే ఒకరి భుజాలమీద బరువుగా వుండడం ప్రేమా ?

పద్మరాణి:

ఒక్కొక్కప్పుడు ఆ బరువు చాలా సౌఖ్యంగా వుంటుంది కదూ ? సగరరాజుని చూస్తే అందుకనే యిష్టం నాకు. ఇంక నేను లేకపోతే బతకలే నట్లుంటాడు.

అభయవర్మ:

సరేగాని సంగతులేమిటి ? మా యిల్లూ, మా వాళ్ళూ ఎట్లా వున్నారు?

పద్మరాణి:

మీ వాళ్ళకేంగాని, యీ కోటా, తోటా చాల బాగా వున్నాయి. ఇక్కణ్ణించి కదలడానికి బుద్ధెయ్యటం లేదు. ఎట్లా అయినా అదృష్టవంతుడవు.

అభయవర్మ:

నీకేం అదృష్టం తక్కువయింది ? నీకు తోటల్లేవూ ?

పద్మరాణి:

ఉంటేనేం, శారద లేదుకదా నాతో తిరగడానికి ?

అభయవర్మ:

ఏం దిగులుగా వుందా ? సగరరాజున్నాడుగా ?

పద్మరాణి:

శారదా, సగరరాజూ వకటేనా ? చాలా వంటరిగా వున్నట్లుంటుంది అప్పుడప్పుడు ? ఎందుకో, ఎవరికోసమో బతికేదనిపిస్తుంది ?

అభయవర్మ:

పెళ్ళి చేసుకో.

పద్మరాణి:

ఎందుకు?

అభయవర్మ:

ఒంటరితనం పోతుంది.

పద్మరాణి:

పెళ్ళా? నేను పెళ్ళిచేసుకునేదానిలాగే కనపడుతున్నానా? ఇన్నాళ్లు నన్నెరుగుదువన్న మాటేగాని, నా సంగతి నీ వెరగవు. పెళ్ళీవొద్దు, యేమీవొద్దు, ఇట్లా బతకనీ. శారద పెళ్ళిచేసుకొని సౌఖ్యపడుతోందిగా.

నిష్క్రమించుచున్నారు.

# 3

హాలులో నర్మద, శారద సోఫాపై కూర్చుని యున్నారు. శారద చదువుచున్న పుస్తకమును పక్కన పెట్టి వినుచున్నది. విక్రముడు సరసుడు, ఎదురుగ కుర్చీలపై కూర్చొనియున్నారు. దుమ్ముపడిన వేటదుస్తులను ధరించినారు. చేతిలో బల్లెము లున్నవి.

నర్మద:

తరవాత—

విక్రమవర్మ:

చెప్పొద్దూ, నాకూ భయం వేసింది. అభయుడు 'ఆలోచిస్తో న్నుంచోన్నాడు. దాన్ని లేపినవాళ్ళ ప్రాణం చిల్లిగవ్వకు చెల్లనట్లు కనపడ్డది. ఇంతలో మేము అడ్డపెట్టకముందే, తటాలున పద్మరాణి బల్లెంతో అంత పెద్దసింహాన్ని డొక్కలో ఒక్కపోటు పొడిచింది. దానిమీద సింహం దూకింది.

నర్మద:

తరవాత—

శారద:

మరి మీరందరు మొగాళ్లూ ఏం చేస్తున్నారు?

సరసవర్మ:

మేమేం చెయ్యం! చుట్టూ పొద. ఆ సింహం దగ్గరకెళ్లడమెట్లా? పద్మరాణిని వొదిలి మావేపు తిరిగిందంటే మేమేం కావాలి? సామాన్యపు సింహమనుకున్నావా యేమిటి?

విక్రమవర్మ:

ధైర్యంలేక కాదు, గాని తొందరపడి ప్రయోజనమేమిటని వూరుకున్నాము.

నర్మద:

సరేలే తరవాత.

సరసవర్మ:

ఇంతలో మన ఉద్దండుడు తనపరాక్రమం వృథా పోకుండా, ఆ సింహానికీ పద్మరాణికీ అడ్డంగా వెళ్ళాడు. కొంచమైతే అయ్యగారు వేంచేసేవారే. పద్మరాణి ఒకచేత్తో అతన్ని లాగేసింది. కాని తనే కాలుజారి వొరిగింది. అంతటితో ఆమెపని అయిందనుకున్నాము. కాని అభయుడు వంటరిగా సింహాన్ని ఆపి, ఆమెను తప్పించాడు.

శారద:

మరి ఆయనకేం అపాయం——

విక్రమవర్మ:

వస్తేనేం? అమ్మగారి ప్రాణానికి అపాయం వస్తోవుంటే వూరుకుంటాడా?

నర్మద:

అంతటితో ఆ శిఖండి చచ్చిందన్నా కాదూ! తరవాత–

సరసవర్మ:

ఇఘ అభయుడు తల పెట్టింతరవాత ఏముందీ, పది నిమాషాల్లో సింహం రక్తంలో పొర్లుతోంది.

శారద:

అమ్మా!

నర్మద:

ఇంతేనా, ఏదో వుందన్నావు?

సరసవర్మ:

అయిందే? విను.

విక్రమవర్మ:

నన్ను చెప్పనీ? ఇంతా ఆ సింహాన్ని చంపి, 'నేను కాదు చంపింది, నువ్వే, అసలు. మేమందరమూ భయపడినప్పుడు దాన్ని ఎదిరించావు, ఉద్దండుడు రాకపోతే. నువ్వే చంపే దానవనీ సింహాన్ని ఎవరు చంపితే వారికిస్తామన్న కిరీటాన్ని దానినెత్తిన పెట్టాడు.

నర్మద:

అభయుడే!

విక్రమవర్మ:

అది సిగ్గులేకుండా, వొద్దనకుండా, నవ్వుతో తలమీద పెట్టించుకుంది.

నర్మద:

ఆహా ఏం బాగావుంది? తరతరాల్నించీ వొస్తున్న ఆ కిరీటాన్ని దానికిచ్చాడా? అభయుడేడీ!

శారద ప్రవేశించుచున్నది.

సరసవర్మ:

దాసితో విడిదిలో వున్నాడుగావును. వాళ్ళు మాతో కలిసి రాక, నవ్వుకుంటూ, గుసగుసలాడుకుంటూ, ఆగుతో వెన

కొస్తారు. ఆ పద్మరాణిముందు మేము కనపడుతున్నామా అతనికి?

విక్రమవర్మ:

అక్కా, నువ్వన్నా చెప్పి వెంటనే యిది మానిపించాలి. లోకమంతా ఏమనుకుంటోందో మనకిక్కడ తెలీదుగాని —

సరసవర్మ:

ఇవు అవిడే ఇక్కడ రాణి.

విక్రమవర్మ:

ఎందుకూ, ఇక్కడ నాలుగు నెల్లదాకా మతం వేస్తుందికదా, అప్పటికి మనంతరం ఎక్కడవుంటామో చూచుకో.

నర్మద:

నేను బతికివుండగా ఆ భయం లేదుగాని...

విక్రమవర్మ:

ఏం, భయం లేకపోవడమేం!

నర్మద:

సైన్యం, ఖజానా, అన్నీ నా చేతులోవుండగా వీళ్ళు చేసే దేమిట్లే?

విక్రమవర్మ:

అట్లానే అనుకో. అన్నీ వాళ్ళ స్వాధీనమయిపోతాయి క్రమంగా. మమ్మల్నిద్దర్నీ ఇక్కణ్ణించి పంపిస్తారు ముందు. అప్పుడు నువ్వేమవుతావు?

సరసవర్మ:

మేం మాత్రం ఎక్కడికి వెళ్ళం? ఆలోచించు.

విక్రమవర్మ:

మనకేంలే. చేతుల్లో సత్తువుంది. ఎక్కడన్నా బతుకుతాం. అక్కసంగతి ఆలోచించు. ఇక్కడ మనం వుండడం అసలు అందుకేగా.

నర్మద:

ఎవరికోసం వుంటేనేం? నా ప్రాణం వుండగా మీ జోలికి రానిస్తానా, ఎవరినన్నా? గతిలేక వచ్చారా యేం?

సరసవర్మ:

మరి, మనం గట్టి ప్రయత్నంలో వుండాలి.

నర్మద:

నిజమే. వ్యవహారం ముదురుతోంది. (శారద ప్రవేశం) మొన్నటిదాకా నాగానే కాళ్ళమీద పడేవాడు. మాట లెట్లా మాట్లాడేవాడు? ఇంకా చంటివాడిమల్లే వున్నాడే, రాజ్యమేం చేస్తాడనుకొనేదాన్ని. నా నోట్లోంచి మాట రావడంతోటే పరిగెత్తుకు వెళ్ళి చేసేవాడు. మా అమ్మటు వంటిది లోకంలో లేదని యీ మూర్ఖురాలితోనే అనేవాడు. ఇది మీ అమ్మ నన్ను కష్టపెడుతోందని దొంగయేడుపులు యేడిస్తే, ఆవిడకన్నా నీకు తెలుసునా అని నోరు బాగా మూసేవాడు. అన్నీ పోయినాయి; ఇప్పుడు చూశారా, ఎట్లా మాట్లాడుతున్నాడో? అసలు నాతో మాట్లాడుతున్నాడా? నామాటంటేనే లక్ష్యంలేదు. దానికన్నా కనాకష్టమయినా వాడి కళ్ళకి. తానెంత పేరుడైనా నా ముందరా! ఎవరను కున్నాడు నన్ను? ఈనాడు తను పెద్దవాడయిందాకా రాజ్య మేలిం దెవరు? ఇప్పుడు గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించినట్లు—

సరసవర్మ:

అతన్నసి ప్రయోజన మేమున్నదీ? అతన్ని పుట్టిన-

నర్మద:

అదేనంటావు దీనికంతా కారణం?

విక్రమవర్మ:

సందేహ మేముంది. ఎప్పుణ్ణించి యీ వివాదాలన్నీ?

శారద:

మిమ్మ్మన్నెప్పుడో పద్మరాణి తన్నిందట కదూ! ఆవిణ్ణి పెళ్ళి చేసుకోమని...

విక్రమవర్మ:

ఎవరన్నారు? ఇట్లాంటి అబద్ధాలుకూడా పుట్టిస్తోందీ!

రక్తమయమయిన వేట గుడ్డలతో అభయవర్మ వడిగా ప్రవేశించి ఎవరివంకను చూడక, లోపలికి పోవుచున్నాడు. ఎదురుగా శారద వెళ్ళింది.

నర్మద:

అభయా!

అభయవర్మ:

(ఆగక నడచుచు) ఎందుకు? పద్మరాణి నాకోసం బయట వుంది, మళ్ళీ వస్తాను.

నర్మద:

(లేచి దగ్గరకు వెళ్ళి) వేటసంగతులు నాతో చెప్పడం ఏమీ, లేదా యేమిటి? ఈ రెండు రోజుల్లోనే యిట్లా మారి పోయి నావేం? మే మెవరం కనపడ్డంలేదూ!

అభయవర్మ:

ఏం లేదు. ఏం మారాను! వచ్చి మాట్లాడతా లే.

నర్మద:

కని పెంచానే, అంతమాత్రం నిన్ను కూచోపెట్టుకొని కబుర్లు వినకూడదూ!

అభయవర్మ:

వినుడుగాని కావలసినంత, ఇంతలో మించిపోయిందేముందీ! వస్తాను.

నర్మద:

నాకు నువ్వుగాక ఎవరున్నారు నాయనా. లేక లేక వొక్కడవు పుట్టావు. ఇంత కరువవుతావా!

అభయవర్మ:

ఏం కరువైనాను? ఇన్నాళ్ళు నీదగ్గిరే వుండలేదూ, ఎక్కడికీ వెళ్ళకుండా? ఇష్టుడుగద నాకు స్నేహితులనీ వాళ్ళనీ? అయితే ఎప్పుడూ, ఎవరితో, మాట్లాడకుండా, నీదగ్గిరే కూచోమంటావా? నేనుమాత్రం పెద్దవాణ్ణవటం లేదూ?

నర్మద:

ఏం మాట్లాడతావు లెద్దూ? నాకు తెలుసులే. యెందుకు దాస్తావు! అమ్మ ఎందుకూ పనికిరాకుండా పోయింది. మును పిట్లానే మాట్లాడేవాడివా? ఇంతకూ—

అభయవర్మ:

(విసుగుతో) ఇన్నాళ్ళు నువ్వు నన్ను తొట్టిలోపెట్టి పెంచావు చాలదూ? శారత్తో మాట్లాడినా, ఇఘచాలు యీవాళకని అడ్డపెట్టేదానివి. ఇట్లా మనుషుల్ని నీ అధికారంకింద

ఎన్నాళ్ళు అణగతొక్కుతావు? నాకింక స్వతంత్రం లేదుగావును? నువ్వు రమ్మనగానే రావాలి, పొమ్మనగానే పోవాలి? ఆ కోడలు యెన్నియేళ్లువచ్చినా. నువ్వు కూచో మంటే కూచుని, వంగోమంటే వంగోవాలి. మా బ్రతుకూ మా స్వేచ్ఛా లేవా ?

నర్మద:

(కన్నీళ్ళతో) ఇన్నాళ్ళు కని పెంచి పెద్దవాణ్ణిచేస్తే ఇవా, నువ్వనే మాటలు?

అభయవర్మ:

అయితే యిప్పుడిదంతా యెందుకొచ్చింది? యేంచేశానని? కావలిస్తే పద్మరాణిని వెళ్ళమని ఇక్కడే కూచుంటాను? సరేనా?

నర్మద:

నాకు తెలుసులెద్దూ; అది, ఆ రాక్షసి, నీ కెక్కువయింది. ఇన్నాళ్ళమట్టీ నీకోసం బతుకుతున్న నేను పనికిరాకుండా పోయినాను. స్నేహితులుట, ఆ పిశాచి, స్నేహితులుట.

అభయవర్మ:

(తొందరగా) నాతో మాట్లాడతలుచుకుంటే, పద్మరాణి విషయమై మర్యాదగా మాట్లాడు.

నర్మద:

(అదిరిపడి) ఏమిటి? ఆవిడగారి నేం అనకూడదేం? నాతో మాట్లాడవుగా! ఇంతవరకొచ్చిందీ!

అభయవర్మ:

నిన్ను ఆవిడ ఏమన్నా అంటే వూరుకుంటానా? అట్లానే.

నర్మద:

మే మిద్దరం వక కేసనన్న మాట. అను, నువ్వు ఆవిడముందు ఎందుకు పనికొస్తావను. (కోపముతో) ఏం, కళ్ళు నెత్తికొచ్చి నట్లున్నాయే! రెండు యుద్ధాలు చేసేటప్పటికి, గొప్ప వాణ్ణయినా ననుకొంటున్నట్టున్నావు.. నేను తలుచుకుంటే పద్మరాణీ నువ్వూ ఏమౌతారో తెలుసునా? వొళ్ళుమరిచి...

అభయవర్మ:

ఏమిటి? నువ్వా? యీ రాజ్యం నువ్వే గెలిచిందిలాగే మాట్లాడుతున్నావే!

నర్మద:

ఆ, ఆ. యేమిటీ; యేమిటీ, మళ్ళీ అను, మళ్ళీ అను, ఇంత పొగరే నీకు! నేను తలుచుకుంటే...

అభయవర్మ:

ఇఖ నీతో మాట్లాడి లాభంలేదు. ఏంచేస్తావో చెయ్యి. (లోపలికి పోవుచున్నాడు. కాని శారద మెల్లగా అతని వెనక వెళ్ళినది. నర్మద పోయి కూర్చున్నది. కాళ్ళు చేతులు వణుకుచున్నవి.)

నర్మద:

చూశారా, వాడిపొగరు! ఏమన్నా లక్ష్యముందేమో! తల్లీ తోడూ యెవరూ అక్కర్లేదు. నేనుట, అక్రమంగా అధికారం చేస్తున్నాట వాడిమీద! నేను అధికారం చెయ్యకపోతే వాడింతవా డెట్లా అయ్యాడో! ఇన్నాళ్ళూ కంటిమీద రెప్పవెయ్యకండా రాజ్యాన్ని కాపాడుకొస్తే ఈ రాజ్యం ఎవడిదని అడుగుతాడూ వీడు నన్ను! ఇందుకా,

నా రక్తం, నా యవ్వనం, నా జీవనం, ధారపోసింది యీ రాజ్యానికి! తనకివ్వడానికా, ఎందుకన్నావా! ఇంక లాభంలేదు. నర్మద ఎందుకూ పనికిరాని దయింది

విక్రమవర్మ:

అధైర్యపడితే ప్రయోజన మేముంది? ఆ చిన్నవాడి మాటలకి నువ్వు దడుస్తావా!

నర్మద:

నేనే దడిసేది? నర్మదే దడవడం! ఏదీ రేపీపాటికి ఎక్కడుంటాడో చూడు. ఈ రాజ్యం ఎవరిదైతేనేం, పాలించే దెవరో చెప్తాను. అదంతా యెందుకు, ఈ రాజ్యాన్ని కావాలంటే నీకో, సరసుడికో, యిస్తే యేంచేస్తాడీ ధర్మమ్మ!

సరసవర్మ:

అదెట్లా వీలవుతుందిలే ప్రజలో! అభయుడి పేరుచెపితే నమస్కరించేస్తారు. ఇంకొకణ్ణి అడుగు పెట్టనిస్తారా యీ సింహాసనంమీద!

నర్మద:

ప్రజలకోటి బుద్ధేడిసింది గావును, నా కొడుకనీ; గౌరవం లేకపోతే వీడిసంగతి ఎవరికేం తెలుసు? అయినా నాకు లక్ష్యమూ? మాట వినలేనాళ్ళే కొడుకూ కూతురునూ! నన్నెదిరించేవాడు కొడుకా! శత్రువుగాని! నాకు కోపమొస్తే నేను చేసేది నాకే తెలీదు, ఏమనాలిగాని తర పాత—

విక్రమవర్మ:

వూరికే ఆగ్రహపడితే లాభ మేముంది! కార్యమాలోచించాలిగాని.

సరసవర్మ:

కార్యమేముంది! మన మేం చెయ్యగలం? చూస్తూ వూరుకోవలసిందే. అయినా యింతలో మించిపోయిం దేముంది?

విక్రమవర్మ:

ఏముందా? రేపట్నుంచి యీ భూతం వూరుకొంటుందా? అంత అధికారమూ తనే చలాయిస్తుంది. అభయుణ్ణి వురిగొల్పి, యీ సైన్యాన్ని లోబరచుకుంటుందంటే మనందరం చికటిలో మహాయాత్రయుపవుతాం. మన కేం, వెంద రాళ్ళే ఎక్కడికన్నా పోతాం. అక్కసంగతి? యిన్నాళ్లూ ఏకఛత్రంగా యేలి, యీనాటికీ మొన్నటిదాకా ముక్కూ మొహం తెలీని పద్మ రాణికి దాసి కావాలి. ఒక్కరోజు ఆలస్యం చెయ్యడానికి వీలులేదు. ఇక్కడ రాణికావడానికి ఎత్తేసే అమ్మగారు కాలు పెట్టింది. అక్కా నేను, చెప్పేది విను. అభయుడిమీద అగ్రహం పడిపడం వొట్టి వెఱ్ఱితనం. అతను నిజముగా ఏ మెరుగడు. యింతకుముందు ఎన్నడయినా యిట్లా చేశాడా?

పద్మద:

ఎవరు ఏంచేస్తే నాకేం! నా కొడుకు నా మాట వినక పోయినతరవాత నే నూరుకుంటానా? పద్మరాణి కాకపోతే ఇంకోతైనా తలమీద కెక్కుతుంది. నన్ను తృణీకరించిన తరవాత నేను వాణ్ణి వూరికే వొదులుతానా? యింత మాత్రం కృతజ్ఞతలేక ... ...

సరసవర్మ:

అతనే యివన్నీ స్వబుద్ధితో చేస్తున్నా, అతన్ని హాని చెయ్యడమంత తెలివి తక్కువ ఇంకేమీలేదు. అతని కేదన్నా

అపాయం జరిగేదవంటే, యీ సేవకులుకూడా మన్నక్కడ ఒక్కక్షణం నిలువనీరు.

నర్మద:

నాకు భయం చెపుతావా! నే నెవరిని! వదీ ఎవరు ఎదురొస్తారో చూస్తాను! నా కొడుకుని నా యిష్టమొచ్చింది చేసుకుంటా, ఇంకెవరికెందుకు! చూద్దాం దాన్ని రేపే పాతికి—

విక్రమవర్మ:

నీకోపం నీ బుద్ధిని మింగేస్తోంది. నీ తెలివంతా యేమయింది? నే చెప్పే మాట విను. ఈ పిశాచాన్ని వొదిలించు! రేపణ్ణుంచి అభయుడు నువ్వు ఎట్లా చెపితే అట్లా పూర్వం మల్లే వినకపోతే నాతల కొట్టించుకుంచు సరేనా!

నర్మద:

దాన్ని వదిలించటమెట్లా? ఒకపట్టాన పడుతుందా?

విక్రమవర్మ:

ఒకటే విధం వదిలించడం. చంపడమే—

సరసవర్మ:

దాన్ని చంపడ మెట్లా! ఆరుగురిని ఒక్కపెట్టున చంపుతుంది.

నర్మద:

మరి...

విక్రమవర్మ:

అదంతా మీకెందుకు! నువ్వు వొప్పుకోండీ! రేపు సాయంత్రానికి, పద్మరాణి శవం నీకు పంపుతాను.

సరసవర్మ:

మరి అభయు డూరుకుంటాడా?

విక్రమవర్మ:

అభయుడికి తెలిసినప్పుడు గదా?

నర్మద:

ఇది బాగానే వుంది. ఎంత పొగరు దానికి! ఎట్లా మాట్లాడు తుంది! నా కొడుక్కీ నాకూ విరోధంపెట్టి చూస్తుందా! నర్మదని ఎదిరించగా బతకడం యీ లోకంలో. లేదు నన్ను చూచి నవ్వినందుకు ఆ పెదవులు నగరరాజుతో కలిసి. కసిదీర ఆ మొహంమీద తంతేగాని తృప్తిలేదు జీవానికి.

విక్రమవర్మ:

ఎవరన్నా వింటారు. బిగ్గరగా మాట్లాడకు. సరసా, రా.

విక్రమవర్మ, సరసుడు నిష్క్రమించు చున్నారు. నర్మద అట్లే ఆలోచించుచు కూర్చున్నది. మూడు నిమిషముల తరవాత, అభయుడు వస్త్రములు మార్చుకొని, వడిగా నడచుచు ప్రవేశించు చున్నాడు. అతని వెనక కన్నీళ్ళతో శారద వడిగా నడచుచు ప్రవేశము.

అభయవర్మ:

ఊరికే పిచ్చిభయం పడకు. ఇంతమాత్రం ధైర్యం లేకపోతే అసహ్యం వేస్తుంది.

శారద:

ఆఖరిమాట! వినరూ నాకోసం!

అభయవర్మ:

ఊహూ.

అభయుడు నిష్క్రమించుచున్నాడు. ఆవంకనే చూచుచు శారద నిశ్చముగ రెండు నిమిషములు నిలువబడినది. కండ్లవెంబడి

మెల్లగా పీడుకారుచున్నది. తటాలున నర్మద పాదములపై బడినది. జుట్టు విడిపోయినది.

శారద:

రాణీ, నేను బతికున్నన్నాళ్లూ నీ దాసీనౌతాను. ఎన్నడూ ఎదురు చెప్పను. మీ కొడుకునేం చెయ్యవద్దు. ఏం చెయ్య నంటేగాని లేవను.

నర్మద:

ఛీ, ఫో, వచ్చినప్పట్నించీ నామీద చాడీలుచెప్పి, వాడి మనసంతా విరిచి, సిగ్గులేక నా దగ్గర కిప్పుడొచ్చావా! ఫో.

శారద:

ఇంకెప్పుడూ చెప్పను. నిజంగా ఆయ నేమీ యెరుగరు. కోపంలో అట్లా మాట్లాడతారు. మీరంటే ఎంతో భక్తి ప్రేమా ఆయనకి. మీ పాదాలమీద పడి వేడుకొంటాను.

నర్మద:

ఓసీ! బుద్ధిలేనిదానా! నీ మొగుణ్ణి నీ స్వాధీనంలో వుంచుకో లేని దానవు, నన్నుపట్టు కేడిస్తే యేముందీ! అవతలికి లాగించనా; లేస్తావా?

శారద:

నేను లేవను. కొడుకని జాలి లేదూ? ఏంచేశారని? నేనే వౌతాను! నాగతి……

నర్మద:

నోరుముయ్యి. అరవకు. ఛీ, ఛీ, నువ్వెక్కడొచ్చావు మధ్య? అభయుణ్ణి ఏంచెయ్యటంలేదు. సరేనా? నాది కడుపు కాదూ? లే.

శారద:

(లేచి) నిజంగా!

నర్మద:

నిజంగానే. ఐ్, నాముందు కనపడకు.

శారద:

బతికున్నన్నాళ్ళూ మీాకు... ...

నర్మద:

పొమ్మంటే. నీ బతుకూ నువ్వూనూ...

వెనుకటి యుద్యానవనము, సాయంత్రము. చీకటిపడుచున్నది. రంగము జరుగుచున్న కొద్దీ వెన్నెలకాంతి హెచ్చుచుండును. ఎండిన చెట్టుకొమ్మపై మోచెయ్యి నానుకొని శారద నిలుచున్నది. జుట్టు విరిపు శోసుకొన్నది. ఆలోచించుచున్నది, గాఢమగు నిట్టూర్పులు అప్పుడప్పుడు విడుచుచున్నది. రెండు చేతులతో ముఖము వత్తుకొనును, కండ్లను వత్తుకొనును.

అయిదు నిమిషముల తరవాత ప్రవేశము సగరరాజు. మిక్కిలి ఉత్సాహముతో నున్నాడు. దూరముగా శారదను చూచి దయతో దగ్గరకు పోవుచున్నాడు. శారద అతనిని చూడలేదు.

సగరరాజు:

శారదా!

శారద పలకలేదు.

సగరరాజు:

శారదా !

శారద ఉలికిపడి అతనివైపు చూచినది. సగరరాజు ఆమెపై చెయ్యి వేసినాడు.

సగరరాజు:

నేనే! ఎందుకిట్లా వున్నావు? చెప్పవూ?

శారద:

నీకు తెలీదూ?

సగరరాజు:

ఊహూ.

శారద:

అభయవర్మ అత్తగారితో పోట్లాడినారు. ఆమె ఏదో చేస్తా
నని బెదిరిస్తోంది.

సగరరాజు:

దీనికి నీకు దిగులా? ఇట్లా ప్రతిదానికీ, దిగులు పడుతూవుంటే
నువ్వు నవ్వేదెప్పుడు? అభయుణ్ణెవరేం చేస్తారు? నేనూ పద్మ
రాణీ లేమూ?

శారద:

నేను దిగులు పడ్డానికే పుట్టాను.

సగరరాజు:

నేను చూడు ఎంత సంతోషంగా వున్నానో!

శారద:

నిన్నరాత్రి దిగులుపడి వెళ్ళిపోయిన వాళ్ళెవరో?

సగరరాజు:

నిన్ను చూసిన తరవాత దిగులు పోయిందిగా? ఇంకెప్పుడూ
దిగులు పడను.

శారద:

నీతో ఇంక మాట్లాడకూడ దనుకున్నా.

సగరరాజు:

ఏంచేశాను!

శారద:

నిన్నరాత్రి నన్నెందుకు ముద్దు పెట్టుకున్నావు?

సగరరాజు:

ఇప్పుడెందుకు కది! కోపం లేదన్నావుగా?

శారద:

లేదుకాని, తప్పేమో అనుకుంటా.

సగరరాజు:

తప్పనుకుంటే పెట్టుకోనులే

శారద:

ఆయన ఏమంటారో అని? అయినా ఆయన్ని అడుగుతాను.

సగరరాజు:

అభయు డేమంటాడు? అతను మాత్రం ఎవరినీ పెట్టుకోడా యేమిటి!

శారద:

ఎవరిని?

సగరరాజు:

ఎవరి నన్నాననూ? పద్మరాణినను!

శారద:

నిజమే!

సగరరాజు:

నేను చూడలేదుగాని, అనుకుంటాను. వాళ్ళిద్దరికి చాలా స్నేహం.

శారద:

ఆయన యిష్టం. కాని, నన్నేమంటారో?

సగరరాజు:

నీయిష్టం నీది. పోనీ అడుగు. మరి వాళ్ళేరీ? ఇంకా రాలా?

సగరరాజు:

వచ్చేద్దాకా నిన్నటి చెట్టుకింద కూచుందాము, రా.

చేతులు పట్టుకొని నిష్క్రమించుచున్నారు. రెండు నిమిషముల తరువాత అభయుడు, పద్మరాణి, ప్రవేశించుచున్నారు. పద్మరాణి చీరె కట్టుకుని యున్నది.

పద్మరాణి:

చెప్పుమా!

అభయవర్మ:

చెప్పడాని కేం లేదు. అక్కడనున్నానే అంతే. వాళ్ళసలే ఉడుక్కుంటున్నారు. ఇంకా ఏడిపించాలనిపించింది, ఆ వృద్ధుని మోటుతనం చూసేటప్పటికి—

పద్మరాణి:

నా ప్రాణం కాపాడావు చాలదూ! నన్ను గౌరవంకూడా చెయ్యాలీ! నేను ఒకళ్ళకి సహాయం చెయ్యడమే గాని, యింకొకళ్ళు నాకు సహాయం చెయ్యడం ఎరగను.

అభయవర్మ:

నేనే నన్న మాట, నీకు మొదట సహాయం చేసింది. నాకు చాలా సంతోషంగా వుంది.

పద్మరాణి:

నాకు మాత్రం భయమేస్తోంది.

అభయవర్మ:

ఏం?

పద్మరాణి:

మొగవాళ్ళ దగ్గరనించి సహాయం తీసుకోకూడదనుకున్నాను.

అభయవర్మ:

నా దగ్గిర్నుంచి కూడా?

పద్మరాణి:

ఆ.

అభయవర్మ:

నామీద నీకంతకన్నా యిష్టముందనుకున్నా.

పద్మరాణి:

యిష్టం లేదన్నానా? అంతయిష్టం యింకెవరిమీదా లేదు.

అభయవర్మ:

నిజంగా?

పద్మరాణి:

నిజం...సరేగాని, రేపటితో వేట అయిపోతుంది.

అభయవర్మ:

మొదలు పెట్టినట్టేలేదు. అయిపోతేనేం? నువ్విప్పుడే వెళ్ళ వుగా? ఎల్లుండినుంచి ఏంచేద్దాం?

పద్మరాణి:

ఏమిటీ? ఉంటాననే నీడూహ?

అభయవర్మ:

ఉండవు మటీ! ఉండకేం చేస్తావు! ఎట్లా వెడతావో చూస్తా.

పద్మరాణి:

చూసుకో. వెళ్ళకపోతే, మీ అమ్మ వెళ్ళమంటుంది సరేనా?

అభయవర్మ:

మా అమ్మవరు వుండమనడానికి, వెళ్ళమనడానికి?

పద్మరాణి:

వెళ్ళమంటే ఏంచేస్తావు?

అభయవర్మ:

అనమను చెపుతా.

పద్మరాణి:

శారదకోసం మీ అమ్మతో పోట్లాడవుగాని, నాకోసం పోట్లాడతావా? ఏం బాగావుంది!

అభయవర్మ:

శారదకోసం పోట్లాడతా, నీకోసం పోట్లాడతా.

పద్మరాణి:

నేను పోట్లాటలు పెట్టడానికి వచ్చాననుకొన్నావా? నాకెందుకు మధ్య?

అభయవర్మ:

నువ్వు వెళ్ళడానికి మాత్రం వీల్లేదులే! స్నేహం చాలా అలవాటయింది. నాపక్కన నువ్వు గుఱ్ఱం ఎక్కుస్తో వుంటే ఎంత గర్వంగా వుంటుంది, నాకు! ఆ గిట్టల చప్పుడు నా గుండెల్లో, సంతోషంగా ప్రతిధ్వనిస్తుంది. నువ్వు నాతో వేటకొస్తే అలసట తెలీదు. నాపక్కన నువ్వున్నంతసేపూ ఎక్కడున్నానో మఱచిపోతాను. ఇంటికి రాగానే మళ్ళీ నిన్ను చూసిందాకా తోచదు.

పద్మరాణి:

శారద వుందిగా?

అభయవర్మ:

వుంటేనేం? నీకుమల్లే శారద నాతో వేటాడుతుందా? పందాలు వేస్తుందా, వోడిస్తుందా? నీవు నాజీవితంలో ప్రవేశించావు. శారద నా ప్రేమలోమాత్రం ప్రవేశించింది.

పద్మరాణి:

నా కేమీ తెలీటంలేదు పోనీలే.

అభయుడు పద్మరాణి మెడమీద చేయివేసి దగ్గరకులాగుకొని.

అభయవర్మ:

నన్ను చూస్తే నీకట్లా వుంటుందా ?

పద్మరాణి:

(అభయుని చెయ్యితీసి) ముందు వొదులు. అట్లా వూపిరాడకుండా పట్టుకుంటే ఎట్లా మాట్లాడను ?

అభయుడు తిరిగి చెయ్యి వేయుచున్నాడు.

పద్మరాణి:

నేను ఎరినో చూడు.

శారద ప్రవేశించుచున్నది.

పద్మరాణి:

మంచి సమయంలో వచ్చావు.

అభయుడు తలయెత్తి, శారదనుచూచి, చెయ్యి తీయుచున్నాడు.

శారద:

ఏం ?

పద్మరాణి:

నన్ను శారద అనుకుంటున్నావని అనపోతున్నా. నిన్ను చూసి కానని తెలుసుకొన్నట్టున్నాడులే.

శారద:

ఈవాళ జరిగింది చెప్పారా ?

పద్మరాణి:

నాతో చెప్పకండా వుంటాడూ, అందులో యీస్థితిలో ?

శారద:

నేను చెపితే విన లేదు. మీరన్నా చెప్పరూ ఆమెతో విరోధ మొద్దని ?

పద్మరాణి:

మఱి నిన్న తగాదాకి నువ్వేగా పురిగొల్పావు ? ఎందుకు అట్లా ప్రతిదానికి బెదురుతావు! ఏంచేస్తుంది ?

శారద:

ఏమన్నా చేస్తుంది, ఆమె సంగతి మీకు తెలీదు.

పద్మరాణి:

ఏడుస్తుంది. ఇట్లాంటి వాళ్ళని చాలామందిని చూశాను. నేను లేనూ, భయమెందుకు?

శారద:

మీరు వెళ్ళింతరవాత ?

పద్మరాణి:

నాతో తీసుకెడతాలే.

శారద:

నా గతి ?

పద్మరాణి:

నువ్వులేకుండానా ? ఇద్దరూరండి. మూవ్వూరు వెళ్ళి యీవిడ సంగతేమిటో కనుక్కుందాము. ఇతనుండగా మధ్య ఆవిడ రాజరిక మేమిటి ?

శారద:

మొదట్నించీ అట్లా చేసుకున్నారు. నిజంగా యేం భయం లేదుకదా? ఆయన్ని మీ చేతుల్లో పెడుతున్నా.

పద్మరాణి:

అతని ప్రాణానికి నా ప్రాణం యిస్తాను సరేనా!

శారద:

నేనూ యిస్తాను. ఏం లాభం లేదుగాని—

పద్మరాణి:

ఇతనూ అదే అంటున్నాడు. పురుషులకి మనం త్యాగం చెయ్యడానికి మనకి యేమన్నా వుండాలి. చంద్రమతి తన్ను మ్మమంది; అంతకంటే ఏంచేతగాక! నేనయితే ఏ నలుడు వదులుతాడో నన్ను వదలమనూ అడివిలో తెలుస్తుంది! సీత నిప్పుల్లో వురికింది, అంతకంటె చాతగాక! నేనయితే!

శారద:

ముందు మిమ్మన్నెత్తికెళ్ళే రావణు డెవడు! (నవ్వుచున్నది)

పద్మరాణి:

కనక వంటమాత్రం చాతయితే మొగవాళ్ళు భోజనానికి మాత్రం వస్తారు. చాలమంది యీ వంట భార్యలతోనే తృప్తిపడతారుగాని, వాళ్ళూ అంతంతమాత్రం మొగాళ్ళే. మన మింక యెందుకూ పనికిరానన్నాళ్ళు, మనగతి యింతే; మననిట్లా వుంచినన్నాళ్లూ, యీ మొగవాళ్ళ గతీ యింతే. ఈ దేశంగతీ యింతే.

శారద:

(నవ్వుచూ) నాకు వంటకూడా చాతకాదు.

రెండు నిమిషములు ఊరికే కూర్చున్నారు.

పద్మరాణి:

సగరరాజుని చూశావా, యీవాళ సాయంత్రం?

శారద:

అక్కడ చెట్టుకింద పడుకున్నాడు.

పద్మరాణి:

ఏం? విచారమే!

శారద:

కోపం—నామీద కోపమొచ్చింది.

పద్మరాణి:

ఎందుకు?

శారద:

(అభయునివంక జూచి) తరవాత చెపుతా.

అభయవర్మ:

మఱి అతన్ని వొదిలేసి వచ్చావేం? పిచ్చివాడు. మఱింత యేడుస్తాడు.

శారద:

మీతో చెపుదామనే వచ్చా. అతనేమిటో అంటున్నాడు.

అభయవర్మ:

(శారద భుజముమీద చేయివేసి) ఏమంటేనేం? నాతో చెప్పడమెందుకు? అన్నీ సందేహాలే? ఆడుకో, పో.

శారద నిష్క్రమించమన్నది.

అభయవర్మ:

నన్ను వేళాకోళం చేస్తున్నావా?

పద్మరాణి:

ఏం వేళాకోళం చేశా? నే ననేదంతా నిజంకాదూ?

అభయవర్మ:

అంతా నిజమే! పోనీ, వెళ్ళవుగదా!

పద్మరాణి:

నువ్వే పోస్తున్నావుగా! నువ్వూ శారదాను.

అభయవర్మ:

ఆరెన్నాళ్లున్నానే చాలదూ! ఇక్కడ వ్యవహారంలో నున్నే వుండాలి.

పద్మరాణి:

ఎన్నాళ్ళు?

అభయవర్మ:

కోపం రాదుకదా! ఎప్పుడూ యిక్కడే వుండాలి.

పద్మరాణి:

ఎంత ఆశ! ఎప్పుడూ.

అభయవర్మ:

ఉండవూ?

పద్మరాణి:

నీకేం తెలియటంలేదూ—పోనీ, ఒకటినూను. నాతండ్రీ, రాజ్యం?

అభయవర్మ:

చెప్పనా, చెప్పాలను కుంటున్నది! నిన్ను చూస్తే నాకు చాలా ప్రేమ–ఇంక నిన్ను వదల్లేను–నన్ను పెళ్ళిచేసుకో.

పద్మరాణి:

ఇంకా యెప్పుడడుగు తావా అని చూస్తున్నా. మరి శారదో?

అభయవర్మ:

శారదాను.

పద్మరాణి:

ఇద్దరూనా? బలే యెత్తే శావే? ఆశ చాలావుంది. శారద నడిగావా?

అభయవర్మ:

అడిగే దేముంది!

పద్మరాణి:

పెళ్ళి అయిన తరవాత నన్నా అంతే లక్ష్య పెడతావు కదూ?

అభయవర్మ:

ఛా, నువ్వు వేరు.

పద్మరాణి:

ఏం వేరు?

అభయవర్మ:

పోసి అడుగు తావెద్దూ, వొప్పుకున్నావా?

పద్మరాణి:

అన్ని షరతులూ కుదరితే.

అభయవర్మ:

షరతులేమున్నాయి? నీ యిష్టం, ఎట్లా వుండమంటే అట్లా వుంటా.

పద్మరాణీ;

తరవాత నన్ను యుద్ధాలూ, వేటా, చెయ్యనిస్తావా?

అభయవర్మ:

నీ కేమవసరం?

పద్మరాణీ:

అవసరమేమిటి? సరదాకి.

అభయవర్మ:

అయినా నీకు తీరుబడివుంటుందా?

పద్మరాణీ:

వంటచేయిస్తావా యేమిటి? ఇప్పుడే చెప్పు

అభయవర్మ:

ఛీ, అధికారమూ——

పద్మరాణీ:

చాలు తెలిసింది. చెయ్యనియ్య నన్ రాదూ?

అభయవర్మ:

అందరూ యేమంటారు? నాకోసం......

పద్మరాణీ:

నీ స్నేహితురాలు పద్మరాణి యుద్ధాలు చెయ్యవచ్చును గాని, భార్య పద్మరాణీ చెయ్యకూడదుకదూ? అప్పుడు నీ

మీాదికొస్తుందిగా! అదిగాక జుట్టు చేతులో చిక్కుతుంది. ఇంకేం! ... పోనీ సగరరాజో!

అభయవర్మ:

మనదగ్గిరికి శాస్త్రో పోతో వుంటాడూ.

పద్మరాణి:

అతను వాదలడు. సన్ను తెరల్లో పెడతానంటున్నావా, నువ్వున్నప్పుడూ లేనప్పుడూ నాదగ్గిరే వుంటాడు.

అభయవర్మ:

అతని కంఠమాత్రం తెలీదనుకున్నావా?

పద్మరాణి:

సరే, ఉణ్ణియ్యవు... నేను బయటికి వెళ్లకూడదు. నా స్నేహితులు నాదగ్గిరికి రాకూడదు. ఇదేనా పెళ్ళి?

అభయవర్మ:

అట్లా అంటే నేనేం చెప్పను? నేనుంటే చాలదూ? ఎక్కడుంటే నేం? ఎవరు లేకపోతే నేం?

పద్మరాణి:

మొట్టమొదట అన్నది మరిచిపోయినావు. నువ్వుంటే నేను చాలన్నానా, నేనుంటే నువ్వు చాలన్నావా? నువ్వు నా మాట విని నాకిష్టంలేంపన్నీ వదులుకోవాలి అసలు!

అభయవర్మ:

అబ్బా, చెప్పుదూ ఈామాటలకేం!

పద్మరాణి:

ఆలోచించనీ. అంతఃపురంలో గోళ్ళు గిల్లుకుంటో కూచోవాలని నీ వుద్దేశ్యం. ఎందుకు నేనట్లా వుండాలి?

అభయవర్మ:

నా ప్రేమకోసం.

పద్మరాణి:

ఇదేదో చాలా గొప్ప ప్రేమగావుందే! నేనింతకీ ఆ ప్రేమ కావాలన లేదే! ఏదో నన్నిట్లా తిరగనీకండా, నా సగర్రాజుతో ఆడుకోనీకండా, నిన్నేంచేశానని బలవంతంగా యీ ప్రేమ నా కంఠాన్ని తగిలించడం? ఇది గాంధర్వంగా వుంది గాని! పూర్వం ఆడపిల్లలు దద్దమ్మలు గనుక గాంధర్వం, రాక్షసం జరిగించారు వాటికి తగ్గ మొగాళ్ళు.

అభయర్మ:

యేమిటీ వేళాకోళం? (ఆమె చేతులు పట్టుకొని) నిజం చెప్పు కోవూ. నాకు తెలుసు, నేనంటే నీకు యిష్టమని.

సగరరాజువచ్చి చూచి వెనుకకు పోవుచున్నాడు.

పద్మరాణి:

రా, రా. ఏం లేదు......సగరరాజు నడుగుదాం.

సగరరాజు ప్రవేశము. అభయుడు కోపముగ దూరముగ నిలుచున్నాడు!

సగరరాజు:

ఏమిటి?

పద్మరాణి:

అభయుడు తనని పెళ్ళిచేసుకోమంటున్నాడు. నువ్వేమంటావు?

సగరరాజు:

(వెలవెలబోవు ముఖముతో) నీయిష్టం. నే నేమంటాను!

పద్మరాణి:

నా యిష్టమేలే; అయినా నువ్వేమంటావోనని! అతను శారదని అడక్కపోయినా, నిన్ను నే నడుగుతున్నా.

సగరరాజు:

అవును శారదతో చెప్పాలి. అసలు శారదకోసం వచ్చాను. ఏది?

పద్మరాణి:

కోపం పోయిందా? పాపం శారద మీదెందుకూ కోపం?

సగరరాజు:

మీతో చెప్పిందా? ఇంతేనా? యింకా...

పద్మరాణి:

భయపడకు. ఇంకేం చెప్పలేదు. (నవ్వుతున్నది)

సగరరాజు:

భయమెందుకు? అభయుడితో చెప్పాలనే వచ్చాను.

పద్మరాణి:

అతను వేరే అడావిడిలో వున్నాడు. ఈ మాటలు అతని కెక్కవు.

అభయవర్మ:

ఇంక చాలు, బుద్ధిలేక అడిగాను.

పద్మరాణి:

(భుజముమీదకొట్టి) అదీ బుద్ధిమంతుడి లక్షణం. కాని ఇంతలోనే కోపం?

అభయశర్మ:

నేను వెడతాను. నేను చెప్పింది వేళా కోళం కాకుండా, నిజంగా ఆలోచించు. (నిష్క్రమించుచున్నాడు.)

పద్మరాణి, సగరరాజూ, అరుగు దగ్గిరకి మాటలాడక వెళ్ళినారు. పద్మరాణి ఆలోచనగా కూర్చున్నది. సగరరాజు ఆమె తొడపై తలపెట్టుకొని పడుకున్నాడు. ఆమె పరధ్యానముగా ఆతని వెంట్రుకలను వేళ్ళతో దువ్వుచున్నది. అయిదు నిమషములు మాటలులేవు

పద్మరాణి:

ఏమిటి, సంగతులు చెప్పు. చాలా వున్నట్లున్నాయి.

సగరరాజు:

నా సంగతులకేం, చెపుతానుగాని, నువ్వు నిజంగా అభయుణ్ణి పెళ్ళి చేసుకుంటావా?

పద్మరాణి:

చేసుకుంటే—

సగరరాజు:

ఏంలేదు, చెప్పుదూ.

పద్మరాణి:

చేసుకుంటే!

సగరరాజు:

నేనో!

పద్మరాణి:

(నవ్వుచూ) నిన్ను పెంచుకుంటాములే.

సగరరాజు:

నా కేమొద్దు

పద్మరాణీ:

ఏం?

సగరరాజు:

పెళ్ళయింతరువాత నన్నిట్లా ప్రేమిస్తావా?

పద్మరాణీ:

తప్పకుండా.

సగరరాజు:

అతను వొద్దంటే?

పద్మరాణీ:

అతనికేం? అతన్నేం మొయ్యమనలేదుగదా! అట్లాంటి అధికారం చేస్తే, ఆనాడే తెలుస్తుంది, ఆభర్తపని.

సగరరాజు:

నాకదే భయం, నీకు పెళ్ళయింతరవాత నేనే పరాయివాణ్ణి అని!

పద్మరాణీ:

పిచ్చివాడా, నిన్ను వొదలేస్తాననుకున్నావా? నా కోసం నీ రాజ్యం, తల్లిదండ్రుల్నీ అన్నీ వొదులుకొచ్చావే!

సగరరాజు:

నన్ను మళ్ళీ వాళ్ళు రానీయరుకూడానూ.

పద్మరాణీ:

పోనీలే నేనున్నానుగా!

సగరరాజు:

అయితే సరే, నీయిష్టం. ఎవరినన్నా చేసుకో. నన్నిట్లా పడుకోనిస్తే చాలు.

పద్మరాణి:

నీ కంతకన్నా ఆశ యేం లేదూ ?

సగరరాజు:

వుండీ యేంలాభం? నేను చిన్నవాణ్ణి. నామీద నీకు అట్లాంటి ప్రేమరాదు.

పద్మరాణి:

ఇదివరకెట్లా అనేవాడవు కావే. వుండుండి ప్రాణం తీసే వాడవు?

సగరరాజు:

ఇవాళ వకటయింది. అది నీతో చెప్పనా వద్దా? ... శారద ... తనకి ... నామీద ప్రేమవుందని చెప్పింది.

పద్మరాణి:

నీకు?

సగరరాజు:

నాకూను.

పద్మరాణి:

నాదగ్గిరికొంచి నువ్వే వెళ్ళేట్టుందే?

సగరరాజు:

ప్రాణముండగా! నీకు అభయుడిమీద ప్రేమవుందా?

పద్మరాణి:

ఎందుకట్లా అడుగుతావు?

సగరరాజు:

చెపుదూ.

పద్మరాణి:

తెలీదు ఇంకా.

సగరరాజు:

నన్ను చూస్తే నీకెట్లా వుంటుంది?

పద్మరాణి:

చాలా బావుంటుంది. నా బుచ్చిబాబయివి కదూ.

సగరరాజు:

నన్నెప్పుడూ నువ్వు ముద్దుపెట్టుకోవేం? శారద పెట్టుకుంది.

పద్మరాణి:

నాకు చాతకాదు.

సగరరాజు:

పోనీ నన్ను పెట్టుకోనిస్తావా?

పద్మరాణి:

నాకు బావుండదు.

సగరరాజు:

ఒక్కసారి పెట్టుకోనీ యిప్పుడు.

పద్మరాణి:

సరే నీయిష్టం.

సగరరాజు ముద్దు పెట్టుకోబోవుచుండగా, శారద వచ్చినది.

శారద:

ఇక్కడున్నాడూ ఆఖరికి! ఎంత వెతికాను!

పద్మరాణి:

రా, కూచో. (సగరరాజు లేచి కూర్చున్నాడు.)

సగరరాజు:

ఇటువంటి రాత్రి నా జన్మంలో ఎరగను.

శారద:

నేనూను.

సగరరాజు:

శారదతో చెప్పనా?

పద్మరాణి:

చెప్పు.

సగరరాజు:

శారదా! పద్మరాణి అభయుణ్ణి పెళ్ళి చేసుకుంటుందిట.

శారద:

నిజమే? నాకెంతో సంతోషంగా వుంది. ఎప్పుడూ నాదగ్గరే వుంటారా! సగరా, నువ్వుకూడా ఇక్కడే వుండాలి.

పద్మరాణి:

అతని మాటలు నమ్ముతావా? అబద్ధం. అతన్ను డికించడాని కన్నా.

సగరరాజు:

నే నుడక లేదుగా!

పద్మరాణి:

అత నిప్పుడుడకడు, వేరే సంతోషంలో వున్నాడుగా!

శారద:

అవును. కాని మీరిక్కడే వుండాలి. వెళ్ళొద్దు. ఎంతో

హాయిగా వుంటుంది నాకు. ఇన్నాళ్ళూ మాట్లాడ్డానికన్నా యెవరూ వుండేవారు కాదు. ప్రతిరోజూ రాత్రీ యిట్లా కూచోవొచ్చు.

పద్మరాణి:

నిజంచెప్పు. నాకోసమా, లేకపోతే సగరరాజుకూడా నీతో వుంటాడనా?

శారద:

నిజంగా మీకోసమే. కాని సగరరాజు లేకపోయినా, నాకు చాలా దిగులేస్తుంది.

పద్మరాణి:

ఎప్పుడూ సగరరాజు ఇట్లావుంటే అభయుడేమంటాడో!

శారద:

ఆయ నేమనడు.

పద్మరాణి:

ఏమో—

సగరరాజు:

ఎందుకంటాడూ? నువ్విక్కడుంటే శారదేమంటోంది?

పద్మరాణి:

నే నుంటేనేం?

సగరరాజు:

నే నుంటేనేం?

పద్మరాణి:

నాకెట్లా చెప్పాలో తెలీటంలేదు గాని! వకటి కాదు.

శారద:

ఆయనన్నడుగుతాను లెద్దురూ.

పద్మరాణి;

ఇవాళ అతను వినేటట్లు లేడు. రేపు చెపుదువుగానిలే.

లోపల నర్మద "శారదా" అని పిలుచుచున్నది.

శారద:

(లేచి) పరవాలేదు చెపుతాను.

సగరరాజు ఆమెచెయ్యి పట్టుకొని వెళ్ళ
వియ్యలేదు. శారద లాగుచున్నది.

శారద;

వెళ్ళాలి వొదులు.

సగరరాజు:

మఱి ...

శారద:

(పద్మరాణివంక చూసి) ఇప్పుడు కాదు. అదేపనా?

సగరరాజు:

అయితే వొదల్ను.

పద్మరాణి సగరరాజుకి చక్కిలిగిలి పెట్టినది.
శారద వదలించుకొని పారిపోవు చున్నది.

సగరరాజు:

నీతో మాట్లాణ్ణు, పో.

పద్మరాణి:

అవును, ఇంకెందుకు మాట్లాడుతావు?

సగరరాజు:

పోనీలే, అట్లానే అనుకో. నువ్వు మాత్రం ఎందుకు మాట్లాడతావులే!

పద్మరాణి:

ఎందుకో కోపం? మరి శారద చివాట్లు తింటే నువ్వు తప్పిస్తావా?

సగరరాజు:

మధ్య నీకేం?

పద్మరాణి:

అవును. మధ్య నేనెవరిని?

సగరరాజు:

నన్నేడిపిస్తున్నావు. కాని శారద నెందుకు పోనియ్యాలి.

పద్మరాణి:

రేపు పట్టిస్తాలే

సగరరాజు:

(పద్మరాణిని కౌగలించుకొని) నామీద కోపం వచ్చిందా? శారదమీద ప్రేమ అని?

పద్మరాణి:

ఛీ. నాకు చాలా సంతోషంగా వుంది, నువ్వింత వాడవైనావని. నన్ను మాత్రం మరచిపోకేం!

సగరరాజు:

మరచిపోతే మాత్రం నీకేం?

పద్మరాణి:

నువ్వేడిపిస్తున్నావు నన్నిప్పుడు.

## ౨౩

## ఒకటవ సీను:

చెట్లప్రక్క తోప - క్రింద ఇసుక - పద్మరాణి. సగరరాజు, వేట దుస్తులతో నిలుచునియున్నారు. ప్రక్కన గుర్రములు మేయుచున్నవి.

సగరరాజు:

ఇంతకూ ఇతను ఎందుకు వెళ్ళినట్లు? నన్నూ రమ్మన్నాడు గాని నేను నిన్ను వొదిలి వెళ్లకూడదనుకున్నా.

పద్మరాణి:

ఎందుకూ లేదు. ఆ ఉద్దండుడు ఏదో చూపిస్తానన్నాడు, ఈయన వెళ్ళాడు.

సగరరాజు:

వాళ్ళిద్దరూ అంటే ఇతని కెందుకో అంత యిష్టం, నాకు తెలీదంటా? మనము హాయిగా మాట్లాడుకుంటూ వస్తూ వుంటే భార్య ఎందుకు వెళ్ళినట్లు? చూడు ఇంకా రాలేదు.

పద్మరాణి:

ఆ తల్లినీ వాళ్ళనీ నమ్మినన్నాళ్ళు ఇతని కభివృద్ధి లేదు. అదే అసహ్యం వేస్తుంది. ఏదో వొక వంకరుండాలి ప్రతి మనిషికీని.

సగరరాజు:

శారదచూడు మన్య ఎట్లా నలుగుతోందో? అదీ నాదిగులు.

పద్మరాణి:

ఆమెకు అత్తమీద భక్తి. ఇతనికి తల్లిమీద భక్తి. ఈభక్తి అనేది, చేసినంత హాని లోకానికి ఇంకేదీ చెయ్యలేదు.

ఎందుకూ పనికిరాని భక్తి, ఆ విగ్రహమీద ఏమిటీ చెప్పా పెళ్ళిద్దరికీ? వాళ్ళనుంచి తప్పించే మార్గముంటే ఇనపాటి యోధుడింకెవరూ లేరు

సగరరాజు:

ఈవాళ అతని పరాక్రమం చూశావా?

పద్మరాణి:

కొత్తేముందీ! అతని ధైర్యం, నిష్కపటం, చూస్తే నాకు అతనిమీద రోజూ గౌరవం ఎక్కువ అవుతోంది. అతన్ని విజయమార్గంలో పెట్టే మనిషివుంటేనా? ఎంతటి వీరుడైనా అవుతాడు.

సగరరాజు:

అది నువ్వేనా యేమిటి?

పద్మరాణి:

ఎందుకాకూడదూ? ఇట్లాంటి ఏ పణ్ణి హెళ్ళ అమ్మ ఇన్నాళ్లూ చీరకట్టి పెంచింది. శారదకు అతన్ని పురిగొల్పటం తెలీదు.

సగరరాజు:

శారదకి తెలీకపోతే ఎవరికి తెలుస్తుంది. నిన్న ఒక్కసాయంత్రం నాకు ఎంత వుత్సాహమిచ్చిందీ?

పద్మరాణి:

(నవ్వుచు) అదేమో నీకు తెలియాలి—

చెట్ల వెనకనించి విక్రముడు, సరసుడు ప్రవేశించుచున్నారు.

సగరరాజు:

రాత్రి అంతా చెపుతాను – చాలావుంది చెప్పడానికి.

విక్రముడు పురి గొల్పగా నరుడు పద్మరాణిని పడిభుజముకింద పొడుచుచున్నాడు. పద్మరాణి వాని జుట్టుపట్టుకొని యీడ్చి వానితో క్రిందపడినది సగరరాజు బాకుతీసి పొడవబోవుచుండగా విక్రమ వర్మ సగరరాజు గొంతుకలో పొడుచుచున్నాడు.

## రెండవ సీను:

కోటలో హాలు. నర్మద కుర్చీల మధ్య ఇటునటు పచారు చేయు చున్నది. శారద చొక్కాకుట్టుచు, దూరముగ కుర్చీ పీటపై కూర్చు న్నది. నర్మద మాటిమాటికి వాకిలివైపు చూచుచున్నది. అయిదు నిముషములలో ఉర్దండుడు ప్రవేశించుచున్నాడు, మిక్కిలి భయ పడుచున్నాడు. వెనుక కట్టెల సవారిపై శవము గుడ్డ కప్పి యున్నది. రక్తము మరకలు. ఉర్దండుడు ప్రతినిముషము మాట్లా డుటకు ప్రయత్నించుచున్నాడు. కాని తెరిపి లేదు.

నర్మద:

(సంతోష మాపుకొనుచు) ఛీ ఛీ, దీన్నిక్కడికెందుకు తీసుకొచ్చారు? ఊరవతల కాకులకీ నక్కలకీ పారెయ్యండి. ఇక్కడ దింపకండి.

శారద:

(చాల భయముతో) ఎవరు? ఎవరు?

నర్మద:

నీ సంగతి కాదు. అవతలకి పో. (ఉర్దండునితో) ఇద్దరేం? పొండి ముందు.

శారద కట్టెవారి చలనములేక చూచుచున్నది.

ఉర్దండుడు:

మీా ...

నర్మద:

నాకేం తెలీదు. దానికీ నాకు ఏ సంబంధం లేదు. తీసుకుపో.

ఉర్దండుడు:

వి క్రమ ...

నర్మద:

వాళ్ళ పేర్లెందుకిక్కడ! వాళ్ళ నిందులో కలిపావంటే నీ తల కాసుకో, జాగ్రత్త! ముందు పో.

ఉర్దండుడు:

మణి... ...

నర్మద:

మణీ లేదు. గిరీ లేదు. నడు ముందర. ఇక్కడింకో మాట అంటే తొద్దు.

ఉర్దండుడు మరలుచున్నాడు. శారద పరువెత్తి తటాలున శవముపై ముసుగు తీసివేసినది.

శారద:

ఆ, పాపం!

నర్మద

సంతోషమేనా? నన్నెదిరించిన వాళ్లగతి యింతే అవుతుంది, ఎవళ్ళయినా సరే.

శారద:

ఎవరు? పిల్లేం చేశారు?

నర్మద:

ఎవరు? పద్మ... ...

ఆగుచున్నది.

శారద:

మీ తమ్ముళ్లు.

నర్మద పరువెత్తి చూచుచున్నది.

నర్మద:

ఆ, ఆ, ఆ, ఎవర్రా యిదీ? ఆ ఆ... ...

ఉర్దండుడు:

యువరాజుగారితో పోట్లాడి పడ్డారు.

నర్మద:

యువరాతోనా? యువరాజుతో నేమిటి? పద్మరాణితో...

ఉర్దండుడు:

కాదు. వినండి. మీ యాజ్ఞయువి విక్రమవర్మ నన్ను యువరాజుని, మిషమీద తీసుకు పొమ్మన్నాడు. సింహాన్ని చూపుతానని తీసుకెళ్ళాను. కాని ఎక్కడ చూపాలో నా కాలోచన తప్పిపోయింది. ఆయన కనుమానంతట్టి వెనక్కొచ్చారు. దోవలో మేము చూస్తూవుండగానే వీరిద్దరూ సగర రాజునీ, పద్మరాణినీ పొడిచి చంపారు. యువరాజుగారు పరిగెత్తి వీరిని అందుకొని యుద్ధంచేసి చంపారు.

నర్మద:

ఇది చెప్పడానికి నువ్వు చేతులు నలుపుకుంటూ వొచ్చావా?

ఉర్దండుడు:

వీర్ని తీసికొచ్చాగదండీ?

నర్మద:

మంచిపని చేశావు! వీళ్ళని చంపుతూవుంటే నువ్వేం చేస్తు న్నావు?

ఉద్దండుడు:

నేనేం చెయ్యనండీ! అడ్డమొడితే నేనుకూడా బలి అయ్యే వాణ్ణే.

నర్మద:

ఆ శూర్పణక కోసం, మామల్ని చంపుతాడా వీడు! అయ్యో విక్రమా, సరసా, నాకోసం వచ్చి యిట్లా అయినారా! ఇంక నాకు దిక్కెవర్రా నాయనా! ముసలితనంలో నన్ను వంటిచేసి పోయినారా! ఆఖరికి అభయుడి చేతుల్లో చచ్చారట్రా? వాడు కొడుకా నాకు? ఒరే, నువ్వు నీ ప్రాణాల కాసించి పరుగెత్తికొచ్చావా? ఇంక వీడు బతికివుంటే నా వంశాన్నే రూపుమాపుతాడు. ఇంకా నా వంశాని కెవ రున్నారు? అయ్యో మానాయన కడుపున పుట్టినవాళ్లందరూ యిట్లా మాయమవుతున్నారు. ఇంక వీణ్ణిమాత్రం బతక నిస్తానా? గంటలోపల అభయుడి తల తీసుకురాకపోతే, నిన్ను కొరత వేయిస్తాను ... పో, కదలవేం!

శారద పెద్దఅరుపు అరిచి నర్మద పాదాలమీద పడుతున్నది.

ఉద్దండుడు:

యువరాజు ...

నర్మద:

వెళ్లు.

శారద:

అయ్యో, అయ్యో, వొద్దు, వొద్దు, నా గతి?

నర్మద:

ఛీ, పో, (ఉర్దండునితో) నువ్వు వెళ్ళు.

ఉర్దండుడు:

యువరాజుగారినే—

నర్మద:

వెళ్ళమంటే మనిషివి కావూ!

శారద:

(ఉర్దండుని చెయ్యి పట్టుకొని) వెళ్ళకు, వెళ్ళకు. కొడుకుని-కన్నవాణ్ణి. అయ్యో, అయ్యో, ఆమెవొళ్లు ఆమెకు తెలీదు. ఉండు. (శారదను నర్మద లాగివేసినది.)

నర్మద:

నువ్వు పో.

శారద:

వెళ్ళొద్దు. ఒక్కనిమిషం ఆగు.

నర్మద:

వెడతావా, వెళ్ళవా; (ఉర్దండుని తోయుచున్నది.)

ఉర్దండుడు:

తొందరపడకండి.

నర్మద:

నడు. (గోడమీది బాకు తీసికొని) వెడతావా? నా చేతు ల్తోనే చంపనా? (ఉర్దండుడు మెల్లగా మరలుచున్నాడు)

నర్మద:

అభయుణ్ణి చంపకండా వస్తే, తెలుసుగదా ?

ఉర్దండుడు నిష్క్రమించుచున్నాడు.

శారద :

పిలవండి, పిలవండి- తరవాత మీరే యేడుస్తారు- అసలు ఆయనకాదు, చంపింది- పిలవండి చెపుతాను.

నర్మద;

నోరుముయ్యి- (నోరుమూసి అవతలకు లాగుచున్నది.)

## మూడవ సీను.

పూర్వపు ఇసుకతోవ-మూడు గుఱ్ఱములు మేయుచున్నవి. సగర రాజు చచ్చి పడియున్నాడు, చుట్టును రక్తము. అభయుని ఆను కొని కండ్లు మూసికొని పద్మరాణి కూర్చునియున్నది. ఆమె కుడిభుజము కట్టబడి యున్నది. కట్టునకు చింపబడిన అభయుని తలగుడ్డ కిందపడియున్నది. అభయుడు అతి ఆత్రుతతో ఆమె ముఖమువంక చూచుచున్నాడు. బాధతో ఆమెముఖము ముడు తలు పడియున్నది.

అభయవర్మ:

ఒక్కసారి కళ్ళు తెరచి చూడు. ఎట్లావుంది ?

పద్మరాణి:

తగ్గుతోంది. ఆదుర్దాపడకు. వాళ్ళేమైనారు ?

అభయవర్మ :

ఎవరు ?

పద్మరాణి :

నీ ప్రియమైన మామలు.

అభయవర్మ:

నరకములో వున్నారు. —

పద్మరాణి:

ఎవరు చంపారు ?

అభయవర్మ:

నేనే.

పద్మరాణి:

అయ్యో నాచేతులోంచి తప్పించుకెళ్ళారా ? సగరరాజేడీ!

అభయవర్మ:

చూడు, అడుగో.

పద్మరాణి :

(కండ్లు తెరచి) అయ్యో! (సగరరాజుపై పడినది) సగరా, సగరా, నిజమే, నిజమే, పోయినావా ? చివరికి నా కోసమే ప్రాణాలు పోగొట్టుకున్నావా? అబ్బా, యీ చిన్నమెడలో ఎంత గాయమో! ఏదీ, నీముఖము! సగరా, కళ్ళుతెరు. నేనూ! పద్మరాణిని. నేనురాకపోతే, ఎక్కడికీ పోనన్నావే? ఇప్పుడెక్కడికెళ్ళావూ? నా అబ్బాయివి కదూ నువ్వూ ? ఇంక యీ పెదిమలు నవ్వవూ? నన్ను యెన్నడూ కొసరవూ? ఈకళ్ళు యింక యెవరిని వెక్కిరిస్తాయి! సగరా, వొక్క మాటు మాట్లాడు. శారద సంగతి చెపుతానన్నావే? ఈ వాళ శారత్తో యేమిచెప్పను? (తల తొడమీద పెట్టుకొని)

నిన్న రాత్రి తేకదూ ఇట్లా పడుకున్నావు! ఇప్పుడు ముద్దు లక్కర్లేదూ నీకు! నా వంటరితనంలో నువ్వున్నావుగదా అనుకున్నా. ఇందుకా మీ వాళ్ళనందరినీ వదలి పొచ్చావు? వున్నన్నాళ్ళూ ఏడిపించావుగదా నన్ను! ఇందరినీ గెల్చి నిన్ను కాపాడుకోలేక పోయినాను. నువ్వు చచ్చి అయినా, నన్ను బతికించాలని చూశావు కదూ! వాళ్ళే బతికుంటేనా యీపాటికి ఎంతగాయమో! ముద్దుపెట్టుకుంటే పోతుందా నెప్పి? బతికివున్నప్పుడు, పెట్టుకోలేను.

ముద్దు పెట్టుకొనుచున్నది.

ఇంక వెడదాము రా. ఇతన్ని వూళ్ళోకి తెప్పించు. ఇంతే కదా, యీ భూమ్మీద స్నేహమూ, ప్రేమా? అన్నీ ఒక కత్తి విసురులో మాయమే.—ఇంతటితో ఆ ప్రేమ ఏమౌతుందో, ఆ సౌందర్యమేమవుతుందో, ఆ నవ్వు ఏమవుతుందో ఎవరికీ తెలీదు. ఎంతముందు మీద నన్నా కసితీర్చుకుని నరకవలసిందేగాని యితన్ని మళ్ళీ తెచ్చుకోలేము. అరగంట సేపటికింద నాతో నవ్వుతో మాట్లాడుతున్నాడు. ఇప్పుడెంత దూరానున్నాడో తెలీదు. అసలున్నాడో లేడో? అయ్యో సగరా!

అభయవర్మ:

సరే ఇంకలే. అయిందేదో అయింది పెడదాము.

పద్మరాణి:

ఎక్కడికి?

అభయవర్మ:

వూరికి.

పద్మరాణి:

నేను రాను.

అభయవర్మ:

ఎందుకు రావూ?

పద్మరాణి:

ఇంటికి వెళ్ళి బతుకుదామనే నీ ఆశ?

అభయవర్మ:

అమ్మమీద వృథా అనుమానం పడుతున్నావు.

పద్మరాణి:

నాకు నీకంటె యెక్కువ తెలుసు – నామాట విను.

అభయవర్మ:

నేనంత పిరికి వాణ్ణా! ఎవరు నష్టం చేస్తారో చెయ్యమను! పుత్రభయాలు పెట్టుకొని మీయింటికి రమ్మంటా వెందుకు?

పద్మరాణి:

ధైర్యవంతుడవే గాని, మామల్ని చంపింతరవాత మీఅమ్మ వూరుకునేదేమో ఆలోచించావా?

అభయవర్మ:

అది నా యిల్లు. మాఅమ్మది కాదు.

పద్మరాణి:

అందుకనే దాన్ని స్వాధీనం చేసుకునే దాకా వూరుకో. వెళ్ళకు. నువ్వు వెడితే నిన్ను మళ్ళీ చూడను.

అభయవర్మ:

నీకేం. నామీద జాలి ప్రవర్తిస్తే చూస్తూ ఉన్నావే.

పద్మరాణీ:

పోనీ లేకుంటే. కాని వెళ్లకు.

అభయవర్మ:

వెళ్ళక మానను. నేనింతవరకు దేనికీ జడవలేదు. ... పద్మరాణికే యింత భయం?

పద్మరాణీ:

సరే, భయమేను అనుకో.

అభయవర్మ:

నేను వెళ్ళిం తరువాత ఏంచేస్తావు?

పద్మరాణీ:

ఏదో వాగుతూ చేస్తాను. నగరరాజు పోయినాడు కదా నన్ను వొదిలి, నువ్వూ అంతే అనుకుంటా.

అభయవర్మ:

నేనడిగినదానికి వొప్పుకుంటే వస్తాను.

పద్మరాణీ:

ఊహూ.

అభయవర్మ:

(దగ్గరకు వెళ్ళి మీద చెయ్యివేసి) ఈ విచారంలో మళ్ళీ యెందుకనుకున్నాను గాని, ఇప్పుడు మనతో వలు చీలిపోయేటట్టు వచ్చింది. ఇంక ఆఖరుమాటు వినవలసిన తప్పదు. నీతో పోస్తే ఇంక నాకు మా అమ్మతో జన్మ విరోధమే.

మాఅమ్మని ఎదిరించడమంటే నాకెట్లా వుంటుందో నీకు తెలీదు. చిన్నప్పటినించీ ఆమెమాట మీరక పెరిగాను. కాని నువ్వు నన్ను పెళ్ళిచేసుకుంటే, ఇవన్నీ లక్ష్యం చెయ్యను. నీ ప్రేమలో అన్నీ మరిచిపోతాను.

పద్మరాణి:

ఇంత తెలిసినవాడ వనుకోలేదు. ప్రేమ వచ్చేటప్పటికి కళ్ళు కనపడవు గావును! మీ అమ్మ అక్కడవుండగా నీకెందుకు యీ ఆశ!

అభయవర్మ:

అంత అధికారం తీసుకుంటూ గా! (ఆమెను కౌగలించుకొని) నేను నువ్వేమి చెయ్యమన్నా చేస్తా. నాతో వుండు. వాద లకు చాలు-

పద్మరాణి:

వొదులు - నాకట్లా పట్టుకుంటే బాగుండదు-

అభయుడు వొదులుచున్నాడు.

నేనంతా ఆలోచించుకున్నాను. నిన్ను చూస్తే నాకు చాలా యిష్టమే గాని, నన్ను పెళ్లిచేసుకోమని మాత్రం అడక్కు.

అభయవర్మ:

నీకు హృదయమనేది వుందా? ఎంతమంది ప్రాణాలు నీకోసం పోగొట్టుకున్నారుకాదు, నిరాశతో? నిప్పుల్లోపడ్డ మిడతల్లాగ మాడిపోయినారు. ఈ వధనంతా టెలుసూ తెలుసూ లేకుండా, నీకు సంబంధం లేనట్లు చూస్తూ వూరుకున్నావు. ఏ సౌంద ర్యమువిచ్చి యిందరి ప్రాణాలు తీసిందో, అది యిప్పుడు నాకె

త్తింది. ఇంక నాకు కూడా ఆశ లేదు. నా కాలం సమీపించింది. నేనూ ఆహుతి అయ్యే సమయం వచ్చింది—

(ఆమె పాదములమీద పడి) నా ప్రాణాలు నీ చేతులో వున్నాయి. నా ఆనందం, జీవనం అన్నీ నీ అన్నీ దుమ్ములో పోస్తావా, చూస్తూ, చూస్తూ? ఇంక పిచ్చితప్ప గతి లేదు. నాతో అంత స్నేహంగా వుండేదానివే! ఒక్కరవ్వ జాలి లేదూ? అదుగో, ఆ మొహంలో ఏమీ చలనం లేదు, రాయి. నామీద స్నేహమంతా యేమయింది? మన ఆటలన్నీ తలచుకో. మనం కలిసి చేసిన యుద్ధాలు జ్ఞాపకం తెచ్చుకో. తక్కినవాళ్ళనిమల్లే ఒక్క కన్నీటిబొట్టయినా విడవక, నన్నుకూడా చంపుతావా? ఇంతేనా—

పద్మరాణి:

ఒక్కసారి ఆగు. లే. (లేవనెత్తుచున్నది) సాధ్య అడ్డపెట్టకు, విను. నీతో ఎందుకు చెప్పడం, నీకే తెలుస్తుంది; నేను చెపితే అర్థం కాదనుకున్నాను. కాని చెప్పక తప్పకొచ్చింది. నువ్వనే రకం ప్రేమ నాకు తెలీదు. నువ్వు పడే బాధ నా కర్థం కాదు. నీమీద నాకు చాలాయిష్టం. నీతో స్నేహం చేసినన్నాళ్ళూ ఎంతో సంతోషంగా వుంది. అంత ఆనందం నేనెవరితోనూ అనుభవించలేను. యీ ప్రేమ తెచ్చిపెట్టి అంతా చెరిపేస్తున్నావు. ఎంతవరకన్నా వేళాకోళంలో తప్పిద్దామని చూశానుగాని, రోజు, రోజూ, ఎక్కువయింది. ఇంక ఒకర్ని ఒకరు వొదిలితేనేగాని భరించడం వీల్లేనంత వరకొచ్చింది. నాకు భార్యరకం ప్రేమ తెలీదనుకుంటాను.

నా స్వభావంలోనే అట్లాంటిదిలేదు. అప్పుడెట్లా వుంటుందో, ఆలోచనకైనా తట్టడంలేదు.

అభయవర్మ:

అదినాకు తెలుసుగాని నామీద నీకు ప్రేమ వుండనుకున్నాను. నీదగ్గిర్నించి ప్రేమ అడగను. నాతోవుండు చాలు.

పద్మరాణి:

ఇప్పుడు లేనూ?

అభయవర్మ:

ఇట్లా కాదు...

పద్మరాణి:

తెలిసింది, గాని, మొగవాడు నన్ను ఆ విధంగా ముట్టుకుంటే నా శరీరాన్ని అవమానపరచి నట్లుంటుంది. నామీంద నాకే అసహ్యమేస్తుంది. నేనది వోర్చుకోలేను.

అభయవర్మ:

(కొంచ మాలోచించి) కాని నేను యువతల పడేబాధా? ఇంక నాకు చావే తప్పదు. నిజం కాకపోతే నువ్వట్లా అంటోవుంటే నేను అడుగుతానా, ప్రాణంతో మళ్ళీ? కాని నాకు సిగ్గూ బుద్ధీ పోయినాయి. వొప్పుకోవూ?

చేతులు పట్టుకొనుచున్నాడు.

పద్మరాణి:

ఏమి టీపిచ్చి! ఉండు, విను, నిజము చెపుతున్నా. నాకెంత కష్టమయినా, నీకోసం ఆఖరికి వొప్పుకునేదాన్నే, నీకు పెళ్ళి

కాకుండా వుంటే. నేను వచ్చాననంటే, శారద గతి యిక చెప్పనక్కర్లేదు.

అభయవర్మ:

నువ్వు రాకపోతే శారదకి భర్తే వుండడు.

పద్మరాణి:

ఈ మాటలెందుకు లెద్దూ!

అభయవర్మ:

ఏమిటీ? నిజమే, వొప్పుకోవూ?

పద్మరాణి:

నామాట విను. తొందరపడకు. ఇప్పుడు మాత్రం యింటికి వెళ్ళొద్దు.

అభయవర్మ:

ఇంకెందుకు నాసంగతి నీకు?

పద్మరాణి:

(అభయుని కౌగలించుకొని) ఎన్నడూ నిన్ను వదలకుండా నీదగ్గరగా వుంటా. ఎన్నడూ నిన్ను వొదలను. స్నేహం మనయిద్దరి జీవనాలనీ వెలిగిస్తుంది. ఎందుకంత సౌఖ్యాన్ని యీ పాడు మోహంతో చెరుపుకుంటావు? నామాట విను. నువ్వంటే చాలా యిష్టం నాకు. ఇంక నాకు ఎవరున్నారు నువ్వుగాక? సగరరాజు కూడా లేడు. నామాట వినవూ? నామీద ప్రేమ వుందంటావే యిదేనా? పెళ్ళిచేసుకుంటే వున్నట్టు, లేకపోతే లేనట్టూనా? (అభయుడు ఊరుకున్నాడు) పోనీ, శారదకూ నాకూ స్నేహమే. వ్రైరిది ఏమీ తెలీని

అమాయకురాలే, నేను చూస్తూ, చూస్తూ ఆమె జీవితం పాడు చెయ్యనా!

అభయవర్మ:

శారద సంతోషిస్తుంది. ఏమీ యోచించకు.

పద్మరాణి:

తెలివయిందయితే యిట్లా వూరుకుంటుందా? మొదట అట్లాగే అంటుంది. సగరరాజు బతికుంటే ... ఎందుకులే అవన్నీ. నామాట విను.

అభయవర్మ:

ఒకమూలనించి నరుకుతో. నెప్పి పుడుతోందా అని యేడ్చి నట్లుంది.

పద్మరాణి:

(అతని చెంపమీద చెయ్యివేసి) అంతే అంటావా? నామీద నమ్మకంలేదూ? నిన్ను వెళ్ళనిచ్చి చేతులారా యెట్లా చంపు కోను? వెళ్ళకు. (ప్రవేశము ఉద్దండుడు)

ఉద్దండుడు:

యువరాజా! రాణీగారు మిమ్మల్నొకమాటు రమ్మంటున్నారు.

అభయవర్మ:

ఎందుకు?

ఉద్దండుడు:

ఏమో ఒకసారి రమ్మంటున్నారు.

అభయవర్మ:

(పద్మరాణితో) నేను వెడతాను.

పద్మరాణి:

నేను వెళ్ళనీను. (ఉర్దండునితో) అతనురాడు వెళ్లు.

ఉర్దండుడు:

అభయవర్మగారు కాదా భయమేమి!

పద్మరాణి:

వీణ్ణి నమ్మకు. వీడు దొంగ. నీచుడు.

ఉర్దండుడు.

ఆడదాని మాటలువిని అభయవర్మ దడుస్తాడా?

పద్మరాణి:

ఏం, పొడుస్తున్నావు. నోరుముయ్యి.

ఉర్దండుడు:

నేను యువరాజుతో మాట్లాడుతోవుంటే మధ్య నువెవ్వరు?

పద్మరాణి:

ముందు ముక్కణ్ణించి పో, యీయన రారు.

ఉర్దండుడు:

ఆమాట ఆయన్ని చెప్పనీ.

పద్మరాణి:

నేను చెపుతున్నా కదులు.

ఉర్దండుడు:

ఆయన వస్తేనేగాని నేను వెళ్ళను.

పద్మరాణి కత్తిదూసి, ఉర్దండునిమీద దూకినది. ఉర్దండుడు క్రింద పడినాడు. అభయుడు ఉర్దండుని తప్పించినాడు. ఉర్దండుడు పరుగెత్తినాడు.

ఉద్దండుడు:

ఆ చెట్లదగ్గిర వుంటూ పదినిమిషాలు, వొస్తేరండి. మీ అన్న చాలా దుఃఖంలో వొళ్ళు తెలీకండా వున్నారు. "అభయుడున్నా ఓదార్చడానికి రాడుగదా" అన్నారు.

నిష్క్రమించుచున్నాడు.

అభయవర్మ:

వొస్తున్నా వుండు.

పద్మరాణి:

(మెడను రెండు చేతులతో పట్టుకొని) వెళ్ళకు, నన్ను వొదిలి పెడతావా? ఇంతే మన స్నేహం? పోనీ, నాకోసం వుండు. నువ్వు లేకపోతే బతకలేను. సరేనా? నామీద జాలి లేదూ? అభయా? ఇట్లా చూడు—నన్ను వొదల గలవ్వా?

అభయవర్మ:

(తప్పించుకొని) నామీద చాలా జాలి చూపించావుగా! ఎందుకు లెద్దూ యీ లేని సంతోషాలన్నీని?

పద్మరాణి:

నిజం, నిజం, దేవుడికి తెలుసు నిన్ను చూస్తే నాకెంత ప్రేమో?

అభయవర్మ:

అయితే వొప్పుకో.

పద్మరాణి:

రెండురోజులు ఆలోచించనీ.

అభయవర్మ :

వెళ్ళనీ.

పద్మరాణి:

(చెయ్యిపట్టుకొని) శారద ఏమవుతుంది? ఇంక శారదకి దిక్కె వరు?

అభయవర్మ:

నువ్వే.

అభయుడు నిష్క్రమించుచున్నాడు. పద్మరాణి విశ్చేష్టితయై అట్లే చూచుచు నిలుచుని, మెల్లగా అభయుడు వెళ్ళినవైపే చూచుచు నిష్క్రమించుచున్నది. నాలుగు నిమిషాల్లో లోపల్నించి "పద్మా" అని అభయుని అరుపు. పద్మరాణి పరిగెత్తినది.

## నాలుగవ సీను:

హాలులో నర్మద ఇటునటు పచారుచేయుచున్నది. తల వూగించును. చేతులు నలుపుకొనును. గొణుగును. శారద ఒకపక్కపడియున్నది. రోజుచు ఉర్దండుడు ప్రవేశించి తటాలున నర్మద పాదములపై పడుచున్నాడు.

నర్మద:

అయిందా?

ఉర్దండుడు:

ఆ.

నర్మద:

తలయేదీ—లే.

లేచుచున్నాడు. లేదని సంజ్ఞ చేయుచున్నాడు.

నర్మద:

మాట్లాడవేం? భయమెందుకు?

ఉర్దండుడు, వణకుచు ద్వారమువైపు చూచుచున్నాడు. తెరలో కలకలము.

నర్మద:

అభయుణ్ణి నిజంగా చంపావా? అయ్యో నిజంగా!

ఉర్దండుడు తల వూగించుచున్నాడు.

నర్మద:

ఏమన్నాడు? ఎక్కడున్నాడు మానాయన? ఏడ్చాడా?

తటాలున ప్రవేశము పద్మరాణి, రక్తమయమయిన దుస్తులతో. ఇద్దరు ద్వారపాలకులను ఎడమచేతితో నరికి, నర్మదమీద దూకినది. ఉర్దండుడు జంచి మూల మూలలకు పరుగెత్తినాడు. నర్మద నిర్ఘాంతపోయి చూచుచున్నది. పద్మరాణి నర్మద మెడ పట్టుకొని పిసికించినది.

పద్మరాణి:

ఓసీ, రాక్షసీ. ఏంపనిచేశావే? నువ్వు తల్లివేనా? నీది కడుపా పాతరా? ఆడదానివేనా? ఈవాళకు పండాయి నీ పాపాలు. ఏదీ, నావంక చూడు. మొహం యెత్తవేం? వొణకవేం? ఏదీ నీ సైన్యం? వొచ్చింది పద్మరాణి. మాటల్తో పోనిచ్చేందుకు అభయుడు కాదు. వెనకనించి దొంగతనంగా పొడిపించడ మనుకున్నావా? ఎదురుగా పొడిస్తే ఏమిచేస్తావు? నాపగరుణ్ణి అభయుణ్ణి చంపించిన పాపాత్మురాలిని ఏంచేస్తే కసితీరు తుంది? మాట్లాడు?

పద్మరాణి మాట్లాడుచుండగా నర్మద ముఖము మారుచున్నది. పిచ్చిచూపు వచ్చినది.

నర్మద:

ఇహి, హి, హి, సుఖ్యా! ఎప్పుడొచ్చావురా! చావలా? విక్రమా, ఇది ఇక్కడికొచ్చిందిరోయ్! అభయుడేడీ, పద్మరాణి, శిఖండి, బైన్యం, ఇక్కడికొచ్చింది రోయ్, పలహారాలు తెండి. ఒరేయ్ ఒరేయ్ ఇది నన్ను చంపుతుంది త్రోయ్. రండి, రండి, చచ్చా, చచ్చా ఆడదానికి ఇదేమిటి? పో, పో, యింట్లోకి. సిగ్గు లేకపోతేసరి.

పద్మరాణి:

ఛీ, యింతేనా నీబలం? మతి చాంచల్యమే! తుచ్ఛురాలా, నీపొగరు నిన్నింత కీడ్చిందా.

నర్మదను పూగించి పడతోసినది.

పద్మరాణి:

వాడేడీ, ఆ దొంగ, ఆ కుక్క, నీచుడు, ఏడీ. ఆ పాంతకుడు?

ఉర్దండుని తరుముచున్నది.

నర్మద:

(లేచి కూర్చుని) ఇహిహి, బలే, బలే, ఆటగా వుంది. పట్టుకో, పట్టుకో. వీడే అభయుణ్ణి, మా అబ్బాయిని చంపింది. కర్కోటకుడు చంపాడు. చంపు. ముక్కలు చెయ్యి, చంపు. బలే, బలే, ఆట బలేగావుంది.

ఉర్దండుడు నర్మద వెనుక నక్కుచున్నాడు. నర్మద ఆతన్ని పట్టుకొన్నది.

రా, రా. యిడుగో, త్వరగా రా.

ఉర్దండుడు నర్మదను కరిచి పరుగెత్తుచున్నాడు.

నర్మద:

అమ్మో, కరిచాడు. సక్కదొంగ, కరిచాడు. వీడు చావా! నరుకు, నరుకు.

పద్మరాణి ఉర్దండుని నిలువున నరుకుచున్నది. ఉర్దండుడు అరచి చచ్చుచున్నాడు.

పద్మరాణి:

నన్ను తప్పించుకుంటావురా!

శారద ఉలికిపడి లేచి, పద్మరాణిని చూచి కౌగలించుకొనుచున్నది.

శారద:

పద్మరాణీ, నువ్వే!

పద్మరాణి:

నేనే, శారదా.

శారద:

అభయుడో?

పద్మరాణి:

లేడమ్మా; ఇంక నేనే, అభయుడు నీకు.

తెర వాలుతుంది.

సమాప్తము.

# శావలిని

## ౧

తుర్కిస్తాన పాదుషానగరు ముందు

అమదుల్లాఖాన్:

అక్రమ్, నీ ఆత్రుత రెండుగడియల వ్యవధినైనా సహించ లేదా ?

అక్రమాలీ:

తండ్రీ, ఆశ అసలే లేనట్టయితే. యిరవై యేళ్ళైనా కళ్ళు మూసుకొని మరచిపోవచ్చు. కాని స్వర్గానుభవము కనుమేరలో కనుపించిన సమయాన రెండు నిమిషాలు ఆలస్యమయినా అత్యంత బాధాకారణమనే విషయం తమ విశాల అనుభవానికి అంతుదూరమై వుండదు.

అమదుల్లాఖాన్:

వినికిడివల్ల నీవు భావించుకొన్న శావలినీ సౌందర్య మింత కాలము నీ హృదయాన్ని అతికి, విడలేక, శాంతి నివ్వక వేదనాజనకమయిందే! ప్రతి మధ్యాహ్న ప్రశాంతంలోనూ, ప్రతిరాత్రీ జ్వలించే ఆరని అగ్నిలోనూ, ఆ మొకలపాటు పడ్డ నా వృద్ధహృదయ మీనాడు యీ కఠిన వియోగవారాశిని భరించగలదా ?

అక్రమాలీ:

కాని నిష్కళంకమైన తమ కీర్తిచంద్రిక నీనాడు అల్పురాలైన యీ స్త్రీ కొరకు మలినపరుచుకుంటారా ? తన

పుత్రుడి విజయ దశమికు మెచ్చి, అతని అభీప్సితముపైని శావలిని మృదదాసిని, బహూకరించి, వృద్ధుడు, భాస్కర తేజుడు, అమదుల్లాపాదుషా, కామాంధుడై తనకు నిరాకరించాడనే, అపకీర్తిని లోకపూజ్యుడయిన నా తండ్రి విషయమై నేను సహించగలనా?

ఆమదుల్లాఖాన్:

కాని, అనుభవ రహితుడవైన, నీవు ఆలోచనా శూన్యుడవై, చపలమైన ఒక వాంఛను వాంఛించావు గాని, వివేక ధుర్యుల సహాలోచనముపై సాహుల్‌ఖన్దు దేశమును స్వీకరించకూడదా?

అక్రమాలీ:

సహస్ర అద్వితీయ సుందర యువతీలోలుడైన అమదుల్లాఖానుడి చంచల హృదయాన్ని దశవర్షాలు ఏకాగ్రముగా బంధించిన అంతఃపుర మకుటరత్నము, శావలిని, లావణ్యానికి ప్రతిఫలముగా ఒక్క విజయ యాత్రతో స్వీకరింపగల తుచ్ఛ భూమిని స్వీకరించిన నా రసికత్వ రాహిత్యాన్ని చూచి నవ్వదా ప్రపంచము?

అమదుల్లాఖాన్:

ఫకీరు అప్జల్గానుంచి సంపాదితమయిన నా జీవమణినిస్తాను.

అక్రమాలీ:

యే కంఠహారాన్ని మకుటముగా నలంకరించను దానితో!

అమదుల్లాఖాన్:

పోనీ, నా అధీనములో వ్యర్థముగా, నా కనువీక్షణాసక్తై పరితపిస్తో, అస్పృశ్యులు, పవిత్రనూతన యువ్వనులు అసమాన

దేహరుచి శోభితంబు, అపసూర్లున్నాను. వారినందరినీ ఈ వనిత కొరకు తెకు బహుబగా—

అక్రమాలీ:

సమస్త సామంత రాజన్య కిరీటమణి విరాజితమైన సభా స్థానములో తమరొనర్చిన వాగ్దానము హాస్యాస్పదము కారాదా?

అమదుల్లాఖాన్:

నీకెందుకీ భ్రమ! నా వృద్ధాప్యావస్థలో నా వాంఛలను అభిలాషలను గుర్తించి, పరిచర్య నతినేర్పుతో చేయగల శ్రద్ధాభక్తులను కలిగివున్నదని దానిపై యింత అమితంగా ఆధారపడ్డాను గాని, దానికి సౌందర్యమూ లేదు. గుణమూ వక్రము, జాణతనమూ శూన్యము. అట్లాంటిదానిని వృథాగా నీ అధీనము చేసుకొని నా నిస్సహాయావస్థ నధికదుస్సహం కావించదలంచిన నీ కోర్కెకి పర్యవసాన మేమిటి?

అక్రమాలీ:

శిలాహార్మ్యాలూ, చీనాంబరాలూ, లోహకవాటాలూ, దాచలేని, శావలినీ మహాద్భుత సౌందర్య పవిత్రకీర్తిని నీ అనృతవాక్యయినా మలినపరచగలదా? ఆమె లోపరహిత విగ్రహాన్ని నీ నాలుకచే కలుషము చేయింపగల బాధ నుద్భవింప చేసిందా నీ వరం!

అమదుల్లాఖాన్:

(విచారము దిగమింగుతో) యీ వాక్కు తెప్పనూ నీకిచ్చి, నా వృద్ధాప్యమహార్ణవాన్ని, యీదగలనా, అశక్తుడను, ఆకర్షణారహితుడను, నేను? దీపశూన్యమైన యీ హార్మ్య

విశాలక్ష్యములో చేసినాకిన్నైన నా హృదయము దగ్ధరమై పగలదా? నీవా యస్వనరూపశౌర్య జ్యోతులతో స్త్రీ చిత్త శలభాలను వేనకువేల నాకర్షించి సుఖించగలవు కద!

అత్రమాలీ:

శీల పాతివ్రత్యాలకు విసుతికెక్కిన హిందూ రాజపుత్రవని తల్పి కాన్కనిస్తాను. తను పాదాలకు వారి ముగ్ధనేత్ర కాంతులూ, వారి రతి సంభ్రమ చమత్కారాలూ చిరపరి చితమైన శావలినీ రాగాన్ని మరిపింపచెయ్యగలవు. సందేహం లేదు.

జమదుల్లాఖాన్:

ఊహూ, వృద్ధ వృక్షము నవలంబించిన బదనికలాగు శావలినీ కన్య నా అంకతలాన కూచుని తన బాహులతలను నా మెడకు పై నవైచి అంబరు వాసనల్ని వెదచల్లే తన ముఖపుష్పాన్ని నా చంప నానించి 'నా కేసరీ!' అంటే, మందగమనమైన నా రుధిరము, గంతులువేసి, తన త్రింశతివర్ష కాలభారాన్ని మరుస్తుంది. రోజారేకులనంటి చిన్న చేతులతో నా చంపల్ని నిమురుతో 'బాల భాను తేజాన్ని ధిక్కరిస్తోంది శరీరచ్ఛాయ' అని కళ్ళలోనించి ఆనంద మోహాజీవధారల్ని నాలో ప్రవేశ పెట్టి నూతన ఆయు పుష్పవికాస చేస్తోవుంటే, సమాధిలో నా శరీరము అనతికాలములో కుళ్ళి పురుగుపాలౌతుందని మరు స్తాను. నా కామధాటికి తాళక, నా కౌగిలిలో నలిగి, 'వృద్ధాప్య శిథిలత నతిక్రమింపగల వరమెక్కడిది నీకు?' అని అడిగే శావలిని—

అ(క్రమాలీ:

(నవ్వుతో) స్తోత్రపాఠములను తాగి పెరిగిన వేళ్ళ అస్పృతాలు విశ్వసించేటంత వృద్ధాప్య చిత్తచాంచల్యము సంభవించినదా యీ సార్వభౌముడికి ?

అమల్లాఖాన్:

అన్పృతాలా ? నీవు నీ మాటలు అబద్ధమని చెప్పినా నేనింక నమ్మగలనా? నాకీ లోకాన వి(శాంతివుందా? కాని నేనెందు కింత బాధలో మండిపోవాలి ? దాని క్షేమధికారముంది నన్నీవిధంగా కాల్చడానికి, అనుమానం కలిగించడానికి ! నీ కళ్ళు పడవలసిన అగత్యమేమి కలిగింది ? అందుకే స్త్రీ, స్త్రీ బుద్ధి ! యింత స్వార్థరహితంగా, సమస్త పరస్త్రీ స్నేహాన్నీ పరిత్యజించి నా జీవనశక్తుల్ని, అంత్యరసికత్వ చాతుర్యాన్ని, తనకోరకే, నా ఆయుఃక్షీణానికి జంకక, వినియోగించి, సర్వాంధుడనై, తన లావణ్యదీప్తిలో మైమరిచి, సకలరాజ్య రమావైభవాలతోనూ, సకల రాజమకుట విరాజిత రత్నాల తోను ఆమె పాదాల నలంకరింపచేసినా—లేశమాత్రము కృత జ్ఞతా భావం చేరనీక—దాన్ని జీవింపనీను. నాకింక శాంతి లేదు. ఆ చంచల నేత్రా లేమద్య రహస్యరంధ్రాల్లోనించో బైటికి వెతుకుతూనే వుంటాయి. నేను సహించను. దాని కంఠాన్ని— (వెళ్ళిపోతున్నాడు)

అ(క్రమాలీ:

నీ విరహాగ్ని అంత తీవ్రమా ? దుర్భరమా ? సముద్రంచేరే నదీ జలమువలె మందగించిన తమ రుధిర ప్రవాహమునే ఆ అద్భుత హాసమాధుర్యం ఇంత వుడికెత్తింపగలిగితే నవ

యవ్వనోద్భృత వేగముగు నా హృదయమెంత నరక వేదన ననుభవిస్తోంది! పది దీక్ష వర్షాలు సేవించినా తనివితీరలేదే తనతృష్ణ! ఒక బిందువుతోనైనా నాలిక తడిపారని జాజ్వల్యమైన నా వాంఛ నన్నెంత కాలుస్తోవుంటుంది! నా విజయాల కీర్తిని విని నా శౌర్యాగ్ని జ్వాలాకాంతులుజూచి, నా రూపాతిశయాల్ని గుర్తించి, నా చేతులలో నాలగలదను కొన్న పావురాన్ని, నీ బాహుపంజరాన బంధించి నిరాశతో కుంగిపోచేశావు నన్ను. ఆ మహోక్షణ యీ మందిరమధ్యాన వున్నంతకాలమూ నా పాదాలు యీ సామీప్యాన్ని విడవవు. ఎవరి అనుగ్రహానికైన ఆశ నాకు రక్షామంత్రమై శతయుద్ధాల విజయశ్రీని నా ఖడ్గము నలంకరింపచేసిందో, అదే ఆ ఆశే నన్ను కాల్చి విదిల్చి, నా నరాల్ని నవిలి ప్రాణాల్ని తీస్తోంది - తమరాస్త్రీని విడవలేరా, యిదుగో కృపాణము, తమరిచ్చిన ప్రాణాన్ని తమరే తీసుకోండి.

అమదుల్లాఖాన్:

అంతగాఢంగా మోహించావా? అక్రమ్! అక్రమ్! నీ ప్రార్థననేది నిరాకరించగలిగాను? నా ప్రబల విరోధి, నా ప్రక్కలో బల్లెము, యూసఫ్‌ని వొదిలాను, నీవు అడిగినంత మాత్రాన! యీ స్త్రీని నీ ప్రేమకూ నా ప్రేమకూ అభ్యంతరం కానిస్తానా! తీసుకో.

అక్రమాలీ:

నిజమే! యీ రాత్రే - యీ రాత్రే!

అమదుల్లాఖాన్:

నేను భరించలేను. వొద్దు. యింకో హస్తము ఆ వక్షు

పర్వతాగ్రాల-నేనో?-వెళ్ళ-నాపుత్రుడివా? నా ప్రాణ ములను సమల నవతరించిన పిశాచివా? హో.

అక్రమమహాలీ:

అబద్ధమే! వృథాస్వప్నమే! యిదిగో కృపాణము!

అమదుల్లాఖాన్:

యెందుకు?

అక్రమాలీ:

ఈ విపరీత సమస్య అంతమయ్యేటందుకు!

అమదుల్లాఖాన్:

నిన్నా! ఎవనిలో నా భుజాందర్పము శాశ్వత జయస్తంభము వలె వినుతికెక్కుతుందో, యెవని శౌర్యదీప్తిలో నేను నా మరణావధిని మీరగలుగుతున్నానో, నిన్ను, నా తొడల మీద నుంచుకుని, ముద్దాడిన, నిన్ను-

కొడుకుని కౌగిలించుకున్నాడు.

బాబూ, నామీద ప్రేమలేదా? నీకు? నన్ను.నన్ను యీ విపరీత మరణ వ్యధకు పాలుచేస్తావా?

అక్రమాలీ:

నన్నో!

అమదుల్లాఖాన్:

నన్నో!

అక్రమాలీ:

యిదిగాక యింకేమైనా-

అమదుల్లాఖాన్:

యీ స్త్రీనిగాని యింకేమైనా-

అ[క్రమాలీ:

నాకింక యీ ప్రపంచంలో కోరతగినది లేదు.

అమదుల్లాఖాన్:

విజయమువల్ల అది నాది.

అ[క్రమాలీ:

వాగ్దానమువల్ల నాది.

అమదుల్లాఖాన్:

నిద్రైనదా, నీ హస్తంలో అది నలిగినదా, నీ కామకలుషిత మైన శ్వాస ఆ మొుగ్గులను మైలపరచినదా! నేను పురుగు నైన తరవాతనైనా, ఆ వేదనలతో నా ఎముకలు గోరీలో గలగల లాడవా ?

అ[క్రమాలీ:

నా గుండె పీకి కింద పారవేసి నీ పాదరక్షలతో చితికించు.

అమదుల్లాఖాన్:

నా కనుగుడ్లను పెరికివేసి...

అ[క్రమాలీ:

యింక యీ సుందరి బ్రతికినంతకాలమూ మనిద్దరికీ శాంతి లేదు.

అమదుల్లాఖాన్:

లేదు.

అ[క్రమాలీ:

చంపేద్దాం.

అమదుల్లాఖాన్:

ఆం.

అక్రమాలీ:

అంతే.

అమదుల్లాఖాన్:

నన్ను వధించు.

అక్రమాలీ:

నా ప్రాణాలు తియ్యి.

అమదుల్లాఖాన్:

పితృహత్య!

అక్రమాలీ:

యిద్దరమూ పరస్పర హత్యచేత-

అమదుల్లాఖాన్:

అంతకన్న అమెనే-

అక్రమాలీ:

ఆ!

అమదుల్లాఖాన్:

అంతే!

అక్రమాలీ:

ఆ!

౨

తనగదిలో యెత్తులేని మంచంమీద శావలిని కళ్లుమూసి పడు కొనివుంది. అమదుల్లాఖాన్, వెనక అక్రమాలీ వొచ్చారు.

శావలిని:

(కళ్లుమూసుకునే) యీ గజమదగంధ మెక్కడనించి?

అమదుల్లాఖాన్:

శావలినీ!

శావలిని:

అదుగో గంభీర ఘీంకారము! యింత ఆలస్యమేం? యీ విరహతాపాన్ని చల్లార్చే ముందు ఆవిజయధ్వాన మెందుకు?

అమదుల్లాఖాన్:

శావలినీ!

శావలిని:

యీ గంభీరముఖాన్ని చూసేముందు మీ విశాల వక్షా లింగనా న్ననుభవించనీయండి. మీ పెదవులు వేసిన యీ ముద్రని మీ పెదవులే వొదల్చాలి.

అమదుల్లాఖాన్:

శావలినీ!

శావలిని:

ఇంకా ఆలస్యమే! చాచిన యీ ఆశాలతలు పట్టుదొరకక వాలిపోతున్నాయి. శూన్యాన్ని వెతికి వెతికి యీ పెదవులు తడి ఆరిపోతున్నయి.

అక్రమాలి మోకరించి, మంచంమీదనించి కిందికి
జారుతున్న కుంతలాలను తాకబోతున్నాడు.

అమదుల్లాఖాన్:

ఆగు.

శావలిని చప్పునలేచి ఒకరినించి యింకొకరివంక చూస్తోంది. అమదుల్లాఖాన్ తల వొంచుకున్నాడు. అక్రమాలీ ఆమె సౌందర్యాన్ని, ఆమె నిలుచున్నప్పటి తీరుని, వొంటిమెరుగుని, పాదాల లేతతనాన్ని, ఆనల్లనిజుట్టు, వొడుపు చూసి విభ్రమము పొందాడు.

శావలిని:

నిశ్చయమయిందా ?

మాట్లాడరు.

అమదుల్లాఖాన్:

నీకెట్లా తెలుసు ?

శావలిని:

ఏ రాత్రి ప్రసూనం తప్పక నా జీవనసరసిలో వికసిస్తుందని భయంతో యెదురుచూస్తున్నానో, అది నా యిరవైయేళ్ళ కాలానికీ మకుటమై విమభయంకరజ్వాలలతో మృత్యురౌద్రరూపాన సాక్షాత్కరించింది. యీ అసహజ పితృపుత్రవైరం భగ్నమని కారణభూతమైన నన్ను భస్మం చేస్తుందని తెలుసు. విధమేది ?

అక్రమాలీ:

స్తె తాను దుర్గమునుంచి క్రింది సముద్రజలాంధకారంలోకి—

శావలిని:

సముద్రరాజ ఏక తనయున్నైన నాకు అర్హతగల విష్కంభమే వెంటనేనా !

అక్రమాలీ:

వెంటనే.

శావలిని:

పదండి.

అక్రమాలీ:

(తన శాలువతీసి) బైటచలి.

శావలిని:

(చిరునవ్వుతో) సముద్ర జలముకన్నా శీతలమా ?

అమదుల్లాఖాన్ మూలుగుతున్నాడు.

శావలిని:

నేను సిద్ధము.

అమదుల్లాఖాన్:

(శావలిని దగ్గరకివచ్చి) కడసారి నా సుందరప్రదేశాన్ని-

శావలిని:

(దయతో అతని గడ్డముమీద చెయ్యివేసి) తప్పకుండా.

అమదుల్లాఖాన్:

(అక్రమాలితో) మమ్మల్ని ఒకనిముషము ఏకాంతముగా వీడు.

అక్రమాలీ:

దూరముపోను, అటు తిరుగుతాను.

అమదుల్లాఖాన్:

భయమేమి ?

అక్రమాలీ:

ఆ గవాక్షాన్ని నమ్మను.

అమదుల్లాఖాన్:

సరే.

అక్రమాలి వీపు వారివైపు పెతిప్పాడు. అమదుల్లాఖాన్ శావలిని రెవిక తొలగించి ఎడమ స్తనముమీది పుట్టుమచ్చను ముద్దుపెట్టుకుని కళ్ళనద్దుకున్నాడు.

అమదుల్లాఖాన్:

యింకెన్నడు ?

కంఠంలో యేడ్చాడు. కప్పివేశాడు.

అక్రమాలీ:

నాకొక్కసారి ఆ దర్శనము లభించదా ?

అమదుల్లాఖాన్:

కళ్ళపై ఆశలేదా ?

అక్రమాలీ:

పోనీ తిరగవచ్చునా ?

అమదుల్లాఖాన్:

ఆ.

అక్రమాలీ:

ఈ రాత్రి చాపలు భోజనముచేసే యీా శరీరాన్ని, ఒక గడియ నాకియ్యకూడదూ !

అమదుల్లాఖాన్:

నీ నాలుక చీల్చనా ?

శావలిని:

బయలు దేరుతాను.

అమదుల్లాఖాన్:

రా.

శావలిని:

బైటచలి. మీ వున్ని అంగీని మెడపట్టాను మరవకండి. అవి ధరింపచేస్తోంది.

(రెండడుగులు నడిచి) నాకోసం అమీనా ద్రాక్షరసం తెచ్చి పెట్టుకుంటుంది (నవ్వుతోంది) శాలికా, శలవు.

దీనికి జామపళ్లు అజీర్ణముచేశాయి సపోటాలు మాత్రమే పెట్టించండి. మీ బీగాలు పక్కకింద ఉన్నాయి. భోజనానంతరం మీకు మందు అమీనాను మరవక యిమ్మని చెప్పండి. నేను చెపుతాను. పిలవనా?

అక్రమాలీ:

వొద్దు.

శావలిని:

అమీనాకు నూరు మొహరీలివ్వరూ ?

అమదుల్లాఖాన్:

తప్పక.

శావలిని:

యేసీ ఒక్కసారి

గదిచుట్టూచూస్తోంది.

ఎంత ఆనందం, మాధుర్యం, ప్రేమ ననుభవించానిక్కడ! యెంత అలవాటయింది యీ పంజరం నాకు! కిటికీ తెర వెనకనించి దూరాన నీలపు పర్వతాన్ని సముద్రాన్ని చూసి యేనాడు మోహపాశం తెగుతుందో, యేనాడు, యేకాకినై ...... పోనియ్యండి. నన్నుందుకోలేక దూరాన నించి నా కిటికీలోనుంచి సంగీతాలు పంపుతున్నా డెంత కాలంనించో-

అమదుల్లాఖాన్:

(దూకుడుగా) యెవరు?

శాపలిని:

నా సముద్రప్రియుడు. యీనాటికి నా బాహూవల్లరితో అతని నీలకంఠాన్ని పెనవేసి, అతని శీతల మృత్యుచుంబ నాలతో వుక్కిరిబిక్కిరౌతాను.

వెళ్ళారు.

3

చీకటిలో మనుష్యులునడుస్తున్న చప్పుడు;
శ్రమ పడుతున్నట్లు నిశ్వాస శబ్దాలు.

ఆక్రమాలీ:

వెనకపడుతున్నావు శావలినీ.

శావలిని:

ఈ శిలలచేత పాదాలు పట్టించుకోడం నాకభ్యాసంలేదు.

ఆక్రమాలీ:

పాపం చీకటిలో యెర్రగా శిలల్ని గాయంచేస్తోంది నెత్తురు.

శావలిని:

రెండు నిమిషాలలో సముద్రాహారజలాలతో యీ గాయాన్ని కడుగుతాను.

నడుస్తున్నారు.

యెవరది, నా జుట్టును తాకుతున్నది?

ఆక్రమాలీ:

అంధకారంలో యీ గాఢాంధకారమేమో అని కళ్ళముందు నుంచి తొలిగించుకో పోయినాను. చివరసారి గంధవహుడి మృదుస్పర్శచేత ధన్యుడౌతున్నాడు. యీ రాత్రి సముద్ర గర్భాన నిద్రించే కళ్ళు లేని లతావితానాలను పైనవేసుకొని వాటికి మృదుత్వ పాఠాలు నేర్పుతాయి శిరోజములు. ఎట్లా?

నడుస్తున్నారు.

అక్రమాలీ:

తండ్రీ! ఒక్క వరము. నన్ను ముందు నడవనీ.

అమదుల్లాఖాన్:

ఏమి?

అక్రమాలీ:

వెనకనించి నీ మెడకింద ఒక్క వేటున నరకాలనే నాచేతి కుతూహలాన్ని పరిపరచుకునే శక్తిని కోల్పోతున్నాను.

శావలిని:

నీకత్తి నిట్లాయియ్యి.

అమదుల్లాఖాన్:

ఆమెని వెళ్ళనీ. వదులు.

అక్రమాలీ:

యీ రాత్రి పగడాలకి మెరుగులు పెడతాయికద! నేనొక్క సారి తాకితేనేం? శావలినీ, సింహళవర్తకులు నాలుగువందల బానిసల విలువచేసే కోలపగడాలను నాకు అమ్మాలని చూసి నప్పుడు వాటిధర నాల్గింతలు చెల్లిస్తాను.

శావలిని:

కొని ఏంచేస్తావు వాటితో?

అక్రమాలీ:

సముద్రంలో విసిరివేస్తాను.

శావలిని:

నేను వాటినందుకొని నాచు లతలతో హారాలుగా గుచ్చి తలమీద ధరిస్తాను.

అమదుల్లాఖాన్:

వొద్దు. వీల్లేదు. నా ఆజ్ఞ.

వెడుతున్నారు.

అక్రమాలీ:

శావలినీ, అయ్యో! పడ్డది యీ రాళ్ళపైన. లేవతీస్తాను.

అమదుల్లాఖాన్:

ఆగు.

శావలిని:

నేను లేచాను.

అక్రమాలీ:

రాణీ, నీ పాదాలకానూర్యోదయ కాంతి నిచ్చిన యీ రుధిరాన్ని యీ శిలలపైన నేను చూడలేను, యీ సౌందర్య రాశి నొక్కసారి నామూపున ధరించనీ.

అమదుల్లాఖాన్:

కాదు. నేను.

అక్రమాలీ:

ఆ వృద్ధ బాహువులు ఆ భారమును సహించలేవు.

శావలిని:

నాభారమును భరించడం ఆబాహువులకే అభ్యాసము.

అక్రమాలీ పళ్ళుకొరుకుతున్నాడు.

నడుస్తున్నారు.

అక్రమాలీ:

శావలినీ! వొణుకుతున్నావు చలిలో.

శావలిని:

చలికాదు. నా ప్రాణేశ్వరుడి నీలపు మొహమల్, దుకూలమూ రత్నహార పరంపరల తేజమూ, నా ఆలింగనానికి వ్యవధి సహింపని సహస్ర బాహువుల తొందరా, నన్నధికానందంలో పులకింపచేశాయి.

సముద్రతీరం చేరారు.

అమదుల్లాఖాన్:

కడసారి చూపుకైనా నా దేవత లనుగ్రహింపరు కదా?

వెలుతురు!

శావలిని:

అక్రమం! నన్నొక్కసారి గాఢంగా కావిలించుకో. రా!

అమదుల్లాఖాన్:

ఆ! ఆ!

అక్రమాలీ:

నిజమే! ఆగు, ఆమె వాంఛిస్తోంది.

శావలిని:

విను.

అక్రమాలీ:

ఆమె కడసారి వాంఛ.

శావలిని:

విను.

అక్రమాలీ:

తిరిగి తిప్పుకోవద్దు.

శావలిని:

విను ముందు. నన్ను నీవు కావలించుకోవస్తే, యీ సింహ నేత్రాలనుంచి చిమ్మే అగ్ని జ్వాలలు నాముఖాన్ని వెలిగించి కనపరుస్తాయని నా వుద్దేశ్యం.

అక్రమాలీ:

అంతేనా ?

శావలిని:

అంతే.

అమదుల్లాఖాన్ :

శావలినీ, నామనో –

శావలిని:

శావలిని యింక నీకు లేదు. సముద్రుడి నీలకంఠాన్ని కౌగలించిన శావలిని పిలువకు.

అమదుల్లాఖాన్:

యింక నాకీజన్మానికి, నీ సరోజ–

శావలిని:

యీ సముద్రదర్పణంలో చంద్రబింబాన్ని గాలి కదలక వీక్షించే శరద్రాత్రి కడసారి నా పాదాల ననుభవించిన యీ శిఖరంనించి కిందికి తొంగిచూడు. నా నూతనభర్త గంభీరాలింగనంలో అతని శ్వేత సికతావక్షంమీద పరుచుకుని భాగీరథీపద్మాలతో విరాజిల్లే నా కుంతలాల్ని చూడగలవు.

అక్రమాలీ:

జనకా, నన్నెంతో ప్రేమించావు. నాకు నీవు నిరాకరించిన దేదీ లేదు. సభాస్థానంలో నాకు కటాక్షించిన యీ మహో

ప్రత్యేష్టవరాన్ని యీ శీతలభీకర మృత్యువు కర్పిస్తున్నావు. ఒక్క ప్రార్థన. ఈ వరానికి ప్రతిఫలంగా నా యావజ్జీవితము నీ సేవకై వినియోగిస్తాను.

నా చేతులతో యీమె నా సముద్రుడి కర్పించనీ-

ఆమదుల్లాఖాన్;

సరే. కాని యెందుకు ?

అక్రమాలీ;

ఆ మృదుబాహుమూలాలకింద నా కఠిన హస్తాలను పోనిచ్చి యీ మహోలావణ్య భారాన్ని పైకెత్తి ఆ కుంతలాగ్ర పరిమళాలు ఆ —

ఆమదుల్లాఖాన్:

వీలులేదు వీలులేదు.

శావలిని నవ్వుతోంది. నవ్వుపర్వతాలతో మారుమోగు తోంది. ఆమదుల్లాఖాన్ అక్రమాలీ భయపడుతున్నారు.

అక్రమాలీ:

యీ నవ్వు పువ్వులై చుట్టూ రాలుతోంది. తీగవలె మెరుస్తో పరుగులెత్తుతోంది. బుల్ బుల్ పిట్టలు బైటికి తొంగిచూస్తు న్నాయి.

ఆమదుల్లాఖాన్:

నా చేతులాడవు.

అక్రమాలీ:

చీకటి యేడుస్తోంది అప్పుడే వొద్దు...

ఆమదుల్లాఖాన్:

పోనీ, మానేద్దామా?

శావలిని:

యేమిటి నా నూతన ప్రియాలింగనం రుచి చూడకండానే? నేను తిరిగి రాను.

ఆమదుల్లాఖాన్:

(అక్రమ్‌తో) కాని దేశం విడిచిపోతావా?

అక్రమాలీ:

నా కాళ్ళాడవు.

ఆమదుల్లాఖాన్ శావలిని పైకెత్తాడు.

శావలిని:

ఆనాడు నా భర్త రుధిరంతో తడిశాయి నీ వున్నత భుజాలు. యీనాడు నా పాదాల రక్తంతో దొప్పదోగు తున్నాయి.

అక్రమాలీ:

ఖండిత కోమల వృక్షము పర్వతపార్శ్వాన్ని లావణ్యాంబు లతో తడుపుతున్నట్లు—

శావలిని:

(నవ్వుతో) వ్యయమూ శ్రమా లేని ప్రయాణం.

ఆమదుల్లాఖాన్:

నా చేతులాడవు.

అక్రమాలీ:

నాకున్నాయి బాహుబలం మనోబలం

శావలిని;

నాకూ వుంది.

నవ్వుతో దూకింది. పడుతో! 'ఆహా యీ విసురు. యీ వాయు కుమారుడి బాహువులు నన్నాప చూస్తున్నాయి' అంటూ నవ్వింది.

[దీనికి రష్యన్ కథ ఆధారం.]

— ... —

# జానకి ఆవేదన

భోగంవీధిలో ఒకయింటో మేడమీద గది గూట్లో జానకి దిగులుగా కూచుని వుంది. పక్కన రాధ నుంచుని వుంది.

రాధ:

ఎంత అడిగినా లాభంలేదా? చెప్పవా? కారణం తెలీని నీ దిగులు నవ్వులని కన్నీళ్ళకింద మారుస్తోంది. ఎప్పుడూ చిరునవ్వులతో హాస్యాలతో కలకలలాడే ఈ గది యెంత చిన్నబోయిందో నీకు కనబడటంలేదూ?

జానకి చెప్పి లాభంలేదని తల వూపింది.

ఏమో! నా సలహా యెటువంటిదో! నీకు సహాయ పడుతుందేమో! పోనీలే. అంత బంగారమైతే దాచుకో.

జానకి:

ఎవడో నాకు—  (రహస్యంగా ఏదో చెపుతుంది.)

రాధ:

ఇంతేనా! పాపం! డాక్టరికి చూపించు.

జానకి:

మీ రెవరూ నాకు దగ్గిరగా వుండకండి. కుట్టి యెప్పుడూ నన్ను ముద్దు పెట్టుకుంటుంది. అందుకనే దూరంగా తప్పించుకుంటున్నాను. నా కేదో తనమీద కోపం వచ్చిందని ఏడుస్తోంది. ఏం చెయ్యనూ?

రాధ:

ముందెందుకు తీసుకోవు? భయమా? సిగ్గా?

జానకి:

బోగందాన్ని నాకు సిగ్గేమిటి? నా ధైర్యాం నీకు తెలీదా? అదేంకాదు... ఎందుకంటే నాకీ రోగమున్నన్నాళ్ళు-దీని మూలంగా... యీ నరపశువులమీద కసితీర్చుకోగలను. ప్రతీరాత్రీ ఐదారుగురికి దీన్ని ప్రసాదిస్తాను. వాళ్ళు, పుచ్చి, యీ రోగాన్ని, నా రోగాన్ని, వాళ్ళ పతివ్రతా పవిత్ర పత్నులకు, ప్రియులకు, తల్లులకు... తండ్రులకు, దాసీలకు-వంటవాళ్ళకు, నాయనమ్మలకు, పెళ్ళికాని పిల్లలకు కూడా సంక్రమింపచేయనీ.

రాధ:

వాళ్ళనందర్నీ నాశనంకానీ, నాకు సంతోషమే. కాని వాళ్ళందరికన్నా అమూల్యమైనదానివి, జానకీ. నీ సంగతో! నువ్వేమవుతావు?

జానకి:

నాకు ఎవరిమీదా జాలిలేదు-నా మీదమాత్రం నేనెందుకు కనికరించాలి. ముఖ్యంగా భాగ్యవంతుల్ని అందమైనవాళ్ళని, నశింపచెయ్యాలి. అంతకన్నా ఈ మర్యాదస్తులని ..ఇన్నాళ్లు వెర్రిదాన్నై యీ ప్రజల్ని నమ్మాను. నన్ను వాళ్ళు మోసగించారు.

నేను మేలుకొన్నాను. వాళ్ళని మోసగించి అధోగతిలోకి యీడుస్తున్నాను. ఎంతో ప్రేమని, కామాన్ని, నటిస్తాను. వెర్రెత్తినదానిమల్లే అరుస్తాను, రక్కుతాను.

మొద్దు వెధవలు. అందంతా వాళ్ళమీద ప్రేమే అని నమ్ముతారు. ఒక్కొక్క కుక్కనే నా అందంతో, చమత్కారంతో భ్రమింపచేసి, నా అరికాళ్ళు ముద్దులు పెట్టుకునేట్టు చేస్తున్నాను. ఒక కుంక నా మీది ప్రేమచేత పుట్టింటికెళ్ళిన తన పెళ్ళాం ఫొటో నాకిచ్చాడు. పాయిఖానాలో పడేశాను.

రాధ:

ఎందుకా కోపం నీకు ?

జానకి:

ఆడది ఒక్కసారి ప్రేమిస్తుంది. మొగాడా కుక్కవలె కనపడ్డదాని వెంటపల్లాపడతాడు. ఎప్పుడూ నిరాకరించేది ఆడది, ఆశ్రయించేవాడు మొగాడు. ఆడది ఒక్కసారి తలతిప్పి చూసిందా, ఇంక వెంటపడతాడు వాడు. కాని తన కోర్కె తీరగానే చీకిగుడ్డని, పాతచెప్పుని, పండుపుల్లని, పారేసినట్టు పారేస్తాడు. ఒక్కరవ్వ కృతజ్ఞతా, జాలీ వుందా వాడికి ?

రాధ :

అందరూ అం తేనంటావా ?

జానకి :

కొందరు కొంచెంనయం. ఎవళ్ళంటే... దొంగలూ, హంతకులూ. వాళ్ళకే మోసమూ, క్రౌర్యమూ తక్కువ. ఏ నేరమూ చెయ్యని, చెయ్యలేని ఈ మర్యాదస్థులంత మోసగాళ్ళూ, క్రూరులూ, ఎవరూ వుండరు. ఎందుకంటే భయం ఎక్కువ. భయమే అన్ని నేరాలకీ, దుర్గుణాలకీ తల్లి. రౌడీలూ

దుర్మార్గులూ, తాము ప్రేమించినదానికోసం నేరంచేసి జైలుకుపోవడానికికూడా జంకరు. వాళ్ళనిచూసి ముక్కుమూసే ఈ మర్యాదస్తులు, తడిగుడ్డలతో గొంతుకోసి, కడుపుచేసి, మొహం తప్పిస్తారు. పైగా ఆ ఆడదానిమీదనే నేరాలు మోపుతారు. అబద్ధాలు, టక్కర్లు, నీచత్వం, రహస్యం, అంతా వారిసొమ్మే. ఈ గొప్పవారు, నాలుగు రహస్య కుటుంబాల్ని పోషిస్తోవుంటారు. ఇంటిదగ్గిర భార్యా, పిల్లలూ చదువులూ, పెళ్ళిళ్ళూ వ్రతాలూ, తద్దినాలూ, ఆవూళ్లోనే యింకోచోట ఓ పంతులమ్మో. రహస్యంగా డాక్టర్లచేత భ్రూణహత్యలూ, ఇంకోవూళ్ళో, ఓ వితంతువూ, శిశు హత్యలూ, ఇంకోవూళ్ళో, ఓ భోగందీ, రోగాలూ—యిదీ వీరి రహస్య చరిత్ర. వాళ్ళదే ఈ ప్రపంచం—ధనం—గౌరవం. నా సంగతి విను. నాకు పదేళ్ళప్పుడు డాక్టరుదగ్గిరికి మందు కోసం వెళ్ళేదాన్ని. మా అమ్మ వాడికి డబ్బు బాకీ. వాడు నన్ను పట్టుకుంటున్నాడని అమ్మతో నేను మొరపెట్టుకుని ఏంలాభం? ఒకరోజు ఆమె అప్ప చెప్పింది నన్ను. ఆ స్థలాల్లో పెరగడంవల్ల నాకు అన్ని సంగతులూ తెలుసు. 'నేను చిన్నదాన్ని' అని అతని చేతులు ముద్దుపెట్టుకుని, బతిమాలి, ఏడ్చాను, వొణికాను. కాని వాడు 'పరవాలేదు, పరవాలేదు, ఎదుగుతావు, తొరగానే ఎదుగుతావంటో— నన్ను పదేళ్ళ పిల్లని, అనుభ వించి, సంతోషించాడు. నాకా... నాబాధ... ఏంచెప్పను నరపశువు? పశువా! కాదు. పాపం పశువులు ఎన్నడూ ప్రవర్తించవు అట్లా!

ఒకరోజు నేను ముందుకువెళ్ళి తలుపు ప్రక్కన భయపడుతూ నుంచున్నాను. వాడు స్నేహితులతో చెప్పి నవ్వుతున్నాడు. నేను ఏమని ఎట్లా ఏడ్చానో—తనేం చేశాడో—ఈ మొగాళ్ళని — యీ పురుగుల్ని — యీ రాక్షసుల్ని ఏంచేస్తే నాకసి తీరుతుంది.

ఈ సంగతి నిజంగా ఈవూళ్ళో జరిగింది. నేనెరుగుదును. ఇట్లాంటివి యీ పవిత్ర హిందూ సంఘంలో లేవనీ, నేను కల్పించి వ్రాస్తున్నాననీ, తిట్టి, వాళ్ళ అంతరాత్మలకి సమాధానం చెప్పుకుని ఇతరుల్ని నమ్మించి, మర్యాద నిలుపుకునే గౌరవనీయు లనేకు లున్నారు. ఇట్లాంటి ఘోరాలు చేసినవారే వాళ్ళల్లో ముఖ్యులు.

-చలం.

జానకి:

అది ప్రారంభం నాపతనానికి! అట్లాజరిగినతరువాత అంత చిన్నతనంలో నా దేహంమీద ఆ ముద్ర పడ్డతరువాత యింక వికాసమూ, ఆరోగ్యమూ కలుగుతాయా! చిన్న మొగ్గని మురికి విషపుగోళ్ళతో సగంవరకు గిల్లితే, అది పుష్పమై పరిమళాన్నిస్తుందా? తక్కిన పూలవలె కాంతినీ, గాలినీ, అనుభవిస్తుందా!

రాధ:

మరి నాడు ఒక్కడు అట్లాంటివాడవి లోకాన్నంతా ఎందుకు ద్వేషించడం?

జానకి:

మరి, తరవాత, మాత్రం నన్నేంచేసింది యీ లోకం! పూజించిదా, ఆదరించిందా? ఎందుకూ, నేనెవరు? నా

ఉద్యోగం ఏమిటి? సంఘంలో నాస్థానమేమిటి? సకలమైన మానవులకూ, నేను పీకదాను, మురికికాలవ, మురుగుదొడ్డిని, వేలకొలది ప్రజలు నన్ను వుపయోగించుకున్నారు. కావలించుకున్నారు. నాపైన మొరిగారు, మూలిగారు. వాళ్ళని, వాళ్ళందర్నీ, నాకు చేతనైతే యేంచేయిస్తానంటే- నా చరిత్ర- ఆడాక్టర్నించి, యింకోడు, వాడినించి యింకోడు - నేను పురుగుని, పెంటను, ముష్టిదానికన్న అధమురాల్ని, దొంగదానికన్న నీచురాల్ని, హంతకురాలికన్న దురాత్మురాలిని. పాకీవాళ్ళు, దేశద్రోహులు, మాతృచోదకులు అల్లాటివాళ్ళుకూడా వొస్తారు నా దగ్గిరికి, మహారాజుల్లాగ డబ్బువృంటేసరి. నేను ఏమిటి? ఏమీకాను, వెలయాలిని.

అంటే ఎవరిదాన్నీ కాని మనిషిని, అందరికీ చెందిన మనిషిని అన్నమాట. అబ్బదాన్ని, అమ్మదాన్ని, అన్నదాన్ని, తెలుగుదాన్ని, తెలగదాన్ని, తురకదాన్ని, హిందువునీ, మాలదాన్ని, ఏదీకాదు, వెలయాలిని.

మనిషినా? కాదు మెదడులేదు. హృదయంలేదు. నన్ను కొయ్యతో చెయ్యలేదు. నాలో గడ్డికూరలేదు. ఇంత నీచంగా వుపయోగించుకుని, మనిషిని పాయిఖానాచేసిన యీ సంఘాన్ని రోగాలతో పుచ్చేట్టుచేసి కసి తీర్చుకుంటాను.

నేనా? నేనూ ఆ హోమంలో దగ్ధమైతేనేం? కానీ ఎంతమంది తమ జీవితాల్ని త్యాగం చెయ్యటంలేదూ! నేనేం గొప్ప?

నాకు జబ్బు తగిలిందని తెలిసేప్పటికి, నావొళ్ళు దహించుకుపోయింది. అపచారం చాలక, ఈ బాధకూడా నా? ఎంత భరించాను? ఈ అన్యాయానికంతా ప్రతీకారం లేదా? నా కింక సంతోషం లేదు. పోనీ కసితీర్చుకున్నా సుఖపడతాను. ప్రేమ అనేది లేనేలేదుకదా, ద్వేషమున్నా కటాక్షించదా విధి! ఏదో వినికిడివల్ల నేగాని సంసారసుఖమంటే యెరుగనుకదా! వీధికుక్కని పిలిచినట్టు దరిగ్గికి పిలుస్తారు. బూడ్సు కాలుతో శొక్కలో ఒక్కతన్ను తంతారు. వాళ్ళవంటి మనిషినికాదా నేను? ఏవిధంగా తీసిపోయినాను? నన్ను వాళ్ళ కామానికి మురుగుతూముగు చేసుకున్నది చాలక ఈ రోగాన్నికూడా భరించాలా? నేను మోతగాడిదనా? నేను భరించను. వాళ్ళనే ఈ పతివ్రతలనే, నామీద వుమ్మేసే ఈ సంసారస్త్రీలనే నా రోగాన్ని స్వీకరించి, పురుగులుపట్టి దగ్ధమయ్యేట్టు చేస్తాను. జగద్దాత్రుసిని, మహమార్రినై, పాపారణ్యాల్ని, కార్చిచ్చువలె, ఆహుతి చేస్తాను. భూభారం తగ్గించి స్వర్గాన్ని పొందుతాను.

రష్యన్‌నుంచి అనువాదం.

—•••—

# వెలయాలి అబద్ధాలు

ఒక గొప్పపట్టణంలో వడపుటింటిలో ఒక కామన్ రూమ్. రాత్రి వొంటిగంట. జానకిరామయ్య ఒక కాలేజి విద్యార్థితో మాట్లాడు తున్నాడు.

విద్యార్థి :

ఎన్నడూ ?

జానకిరామయ్య :

ఎన్నడూకూడా.

విద్యార్థి :

సరే. అది మీయిష్టమనుకోండి. కాని విచిత్రంగానే వుంది యింత వైరాగ్యం. కారణం?

జానకిరామయ్య :

పదేళ్ళకిందట ఒకసారి చవిచూశాను. ఆ అనుభవం యీ జన్మానికి చాలుననిపించింది. ఈ వేశ్యలతో సంబంధం వెగటు పుట్టిస్తుంది. విసుగు, అసహ్యం అంతే కారణం. కిటికీ అద్దంమీద ఈగలవతు. రెండుయీగలు కాసేపు అతుక్కుని వుంటాయి. 'ఏంచేశామూ!' అన్నట్టుమూసి, వెనక కాళ్ళతో వీపులు గోక్కుని దేనిదోవన అది యెగిరి పోతుంది. సరిగా అట్లావుంటుంది యిక్కడ జరిగే వ్యవ హారం. నేనేమీ అతీతుణ్ణికాదు. కాని నా స్వభావంలోనే ఆడవాళ్ళని చూస్తే సిగ్గూ, మర్యాదావున్నాయి. వొదలవు.

చొరవతక్కువ. వీళ్ళకేమో మోటు కామమూ, ఉద్ధృత మైన యీర్ష్యా, కసిళ్ళూ, విషాలూ, తన్నులూ, త్యాగాలూ అలవాటు. వీళ్ళస్వభావం అట్లాంటివి కోరుతుంది. స్త్రీ హృదయానికి సదా ప్రేమకావాలి. వీళ్ళకా, ప్రతి నిమిషమూ అనేకులైన పురుషులు అనేకవిధాల ప్రేమ వాక్యాలు వినిపిస్తోవుంటాయి. విని విని విసుగెత్తి, ఆ ప్రేమ చప్పదంలోకి మిరియపుపొడివుంటే బావుండునని ఆశపడ తారు. ప్రేమ కావ్యాలేకాదు, ప్రేమని తెలియచేసే కార్యాలుకూడా కోరతారు. అందువల్లనే దొంగలూ, హంతకులూ, రౌడీలూ వాళ్ళు యీ పిల్లలకి నచ్చిన ప్రియులు. అదిగాక వీళ్ళతో ఆ సంబంధం పెట్టుకున్నానా, మామధ్య యేర్పడ్డ సుకుమారమైన స్నేహం నశిస్తుంది.

విద్యార్థి :

చాల్లెండి, యీ విపరీతంమాటలు. మీరు చెప్పేదే నిజ మైతే రాత్రింబవళ్ళు యిక్కడే ఇంకా ఇట్లా వేళ్ళాడుతో వుంటారేం ?

జానకిరామయ్య :

నాకోకపనిలేదు. ఎక్కడెక్కడో, అన్నిప్రదేశాల్లోనో యిట్లా వేళ్ళాడాను, యీ విచిత్రమైన లోకం పరీక్షచేస్తో ఇక్కడ జీవితం నగ్నరూపంతో ప్రసన్నమౌతుంది. భయం కరమైన నిజస్వరూపం చూపుతుంది. మర్యాదలూ, అబద్ధాలూ, రహస్యాలూ, నటనలూ లేవిక్కడ. అసలు సంగతి బైటపెట్టుకుని కూచుంది. లోకరహస్యం యీ గృహంలో. శాస్త్ర నీతి వచనాలతోగాని, పురాతన

పూర్వాచారాలతోగాని, స్వంత అంతరాత్మతోగాని రాజీ లేదు. మాయలేదు. అలంకారాలూ, కవిత్వమూ లేవు. “నేను స్త్రీని నేను ప్రతివాడికి చెందిన పాత్రను. ఈ పట్టణంలో అధికంగా మిగిలిపోయిన కామమంతా దేంట్లోంచి ప్రవహిస్తుందో ఆ మురికి కాల్వను నేను. ఇష్టమున్న వాళ్ళెవరైనా రండి, నాదగ్గిరికి. ఎవరూ అభ్యంతరం పెట్టరు. నిరాకరణ మనేది నావద్ద లేనేలేదు. ప్రతివారి దాసీని నేను. కాని ఒక్క నిమిషం శరీరవాంఛ తీర్చుకున్నందుకు, విలువ...... ధనమూ, అసహ్యమూ, రోగమూ, అవమానమూ.”

విద్యార్థి :

ఏమో! మీరట్లా అంటారుగాని, ఈ వేశ్యలా-నోరు తెరిస్తే అబద్ధాలు మాట్లాడుతారు. మొదట దాన్ని చెరిచినవారెవరని అడగండి! ఎన్ని విపరీతమైన కథలు చెపుతారో!

జానకిరామయ్య :

అవును, అడిగినవాళ్ళది తప్పు. మీ కెందుకు ఆసంగతి? వీళ్ళు అబద్ధాలు చెప్పినా, చిన్న పిల్లలు చెపుతారు చూడండి, అలా చెపుతారు. చిన్నపిల్లలేం చేస్తారు? ఎన్నో విషయాలు కల్పించి, నిజమని నమ్మినట్టే చెపుతారు. ఐతే నేం! ప్రపంచంలోకల్లా 'సిన్సియర్‌గా' గా మాట్లాడేదీ, చరించేదీ పిల్లలేకద! పిల్లలూ, వేశ్యలూ అబద్ధాలాడడం పెద్దవాళ్ళమైన మనతోనే. వాళ్ళల్లో వాళ్ళబద్ధాలాడుకోరు. పూరికే కథ లల్లుకుంటారు. మనం కావలసి వాళ్ళని బాధిస్తాం గనక అబద్ధాలాడుతారు. మన మర్థంచేసుకోలేని

వాళ్ళ ఆత్మల్లోకి, మన ప్రశ్నలతో, మన జిత్తులతో తొంగి చూస్తాము. అంతటితో మనని మోసగాళ్ళా, తెలివితక్కువ వాళ్ళా అని నిశ్చయించుకొని, మనని మోసపుచ్చ డానికై వాళ్ళు ప్రయత్నిస్తారు. మనమే వాళ్ళ అబద్ధా లను "ఎన్క-రేజ్" చేసేది. చూడండి! మొహమంతా రంగేసుకుంటుంది, అందవికారంకూడా. ఎందుకు? మనని మోసపుచ్చేందుకు. ఎందుకు? మనమే మోసపుచ్చమని అడుగుతాము గనక. తెలిసికూడా మోసపోవడానికి యిష్ట పడతాము. అడుగుతాము. ఒక విధానా? అప్పుడే పొడ చూపిన యవ్వనంతో బాధపడే కాలేజి కుర్రాళ్ళు వసంత కాలంలో వెర్రెత్తి, మదమెక్కి వూరపిచ్చికలపలె, వొచ్చి పడతారిక్కడ. తొమ్మిదిమంది చచ్చుపిల్లల్ని కనిపించి, పదోగర్భం భార్యకు తెచ్చిన గుమాస్తా—ఎక్కువవున్న కామాన్నంతా ఇక్కడ వొదిలి పోవాలంటాడు. దాన్ని 'ఎన్‌జాయ్' చెయ్యడం అంటారు. ప్రతి వెధవకీ అందం కావాలి, అందం అంటే ముక్కూ మొహం తెలీనివాడికి కూడా. ఎర్రగా వున్నదంతా అందం? తియ్యగావున్నదంతా రుచీ. అట్లాంటివాళ్ళ కళ్ళకి మెరుగ్గా రంగువేసి తయా రౌతారు వీళ్లు. అది వొకటీ. రెండోది అందం చాలదు ఈ రసికులకి. ప్రేమ కావాలి. ఎక్కణ్ణుంచి వొస్తుంది ప్రేమ? కనక ప్రేమనుబోలిన నటన ఐనాసరే సరిపోతుంది. తన ముద్దులవల్ల ఈ స్త్రీ కామోద్రేకంతో జ్వలించాలిట. ప్రబం ధాల్లో వాడు చదువుకున్న కామం—ప్రత్యక్షంగా కొను క్కుని అనుభవించాలంటాడు. "అదా నీకు కావలసింది?

నే నిస్తానం" టుంది వేశ్య. మోహంలో మోహం, కళ్ళల్లో కరుణ, కంఠంలో వగర్పు-నిట్టూర్పులు, మూల్గులు—మీ చిత్తం-ఎట్లానంటే అట్లా అభినయిస్తుంది. వాడు, 'నేను ఎంత అందగాణ్ణో! ఈ స్త్రీలకు-ప్రతి చంచలాక్షికి-నా మీద యింత మోహమేమో! వీళ్ళని ఇంత దుర్భరావస్థకు తేగలిగానే. నే నెంత చతురుణ్నో, ఎంత వీర్యవంతుణ్నో' అని పుబ్బిపోతాడు. వాడికి నటన అని తెలీదా? తెలుసు. కాని అబద్ధమే కావాలంటాడు. కనక వేశ్య వర్తిస్తుంది. ఎవరు అబద్ధాలకు కారణం? వేశ్యదా తప్పు?

మూడోది-నిన్నెవరు మొదట చెరిచారని ఎవరన్నా అడిగితే అబద్ధా లాడుతుంది. కాని వాడి మొహం తగల బడా, వాడి కదేంరోగం! వాడికెందుకా సంగతి, వాడిపనేదో వాడు చూసుకోక! వాడి భార్యగాని, చెల్లెలుగాని, మొదట ఎవర్ని కావిలించుకుందో అడిగిండా వేశ్య? డబ్బిచ్చాడం టూరా? ఆడబ్బుకి, శరీరం, కాలం. అందం, యినీ్న కాక పైగా సంభాషణా! అందులో సత్యంకూడా చెప్పాలీ? అట్లాంటి తెలివి తక్కువ ప్రశ్నలకి చంపకాయ లివ్వాలి. వాడి మొహానికి, వాడి 'టేస్టు'కి ఎటువంటికథ రుచిస్తే అట్లాంటిదే కల్పించి చెపుతుంది వేశ్య. నిజంచెపితే మాత్రం సంతోషి స్తాడా? నమ్ముతాడా? చెపుతున్నంతసేపూ లొట్టవేసి, పైగా అబద్ధంచెప్పిందని 'కంప్లెయింట్లు' చేస్తాడు. అంతే కాదు; ఇంకా అబద్ధాలు చెపుతారు. ఇవ్వాళే నువ్వు స్వరాజ్యం కావాలంటే 'అవును ఇప్పుడే కావాల'ని ఖద్దరుచీరె కట్టుకుని వస్తుంది.

రేపింకోడు లోకమంతా కాతలిస్తూగా మారాలంటే, నిజమని, 'క్రాసు' కట్టుకొస్తుంది. ఆమె మనసు నాకర్షించావా, సమస్తమూ వొదిలి, నీ వెంట దేశాలన్నీ తిరుగుతుంది. దొంగతనాలకి, విప్లవాలకి, హత్యలకి నీతో దేనికన్నా సిద్ధం. చంటిపిల్లవంటిది. ఏమెరుగదు. అంత దుర్మార్గురాలులాగు కనబడుతుంది గాని, వాస్తవంగా అంత అమాయకురాలు.

చిన్నప్పటినుంచి యిదేవృత్తి. లోకాన్నెరుగదు. పసిపిల్లవలె-తిండీ - నిద్రా-పైగా తాగుడూ, పురుషుడూ, పక్కా, డబ్బూ, చీరా, ప్రియులూ, డాక్టరూ, ఆస్పత్రి; పోలీసు వాడు. అంతే జీవితమంటే అర్థం. పెద్దవృక్షాన్ని చిన్న గులేబులో పెంచినట్టు.

ఎంత భయంకరం-పైశాచికమో గుర్తించారా? రాత్రులు ఈ చెరబడడం-పోలీసువాళ్ళ భయం, మందులు, రోగాలూ, మొగాళ్ళమీది అసహ్యం, వాళ్ళతో యిష్టంలేని నాటకం—కాని తక్కిన వృత్తులలో వుండే అబద్ధమూ, కపటమూ, మాయా, వీళ్ళ జీవితంలో లేవు. ఈ సంసారాల్లో మాత్రం-భార్యాభర్తల సంయోగాలలో యెన్నితగాదాలు' ఎత్తిపొడువులు, నీచపు పలుకులు, మోసం, క్రోధం, ద్వేషం, యెన్ని వున్నా, పైకి పవిత్రం, లోపల నీచం. విధి లేక ఒక యింట్లో, ఒక గదిలో, ఒక పక్కమీద పడి వుండడం- అందమై కరుణారహితమైన, పశువులయినా యెరగని, గురిచూసి మనస్ఫూర్తిగా బాధించాలని చూసే

క్రౌర్యం, నీచత్వం—ఈ సంసారాల్లో ఎంతవుంది? కాని పవిత్రమూ, దైవ నిర్మితమూ, నైతికమూ అనే పేర్లతో రంగులతో చిత్రించి పూజిస్తారు ఆ సంసార బంధాన్ని.

అనవసరమైన యీ అసంఖ్యాకమైన వృత్తుల స్థితి తెలుసుకోండి. తన గూటిని, తన తిండిని, తన ఆడదాన్ని, తన పిల్లను రక్షించుకోడానికి యీ నాగరకత పొందిన ప్రజసృష్టించిన యీ వృత్తులు, యిన్‌స్పెక్టర్లు, పోలీసులు, ప్లీడర్లు, జడ్జీలు, జైలర్లు, దండనాయకులు, ప్రెసిడెంట్లు, సోల్జర్లు - మనుష్య స్వభావంలోని, అత్యాసను కాపీనాన్ని, దుర్మార్గాన్ని, బానిసత్వాన్ని సోమరితనాన్ని, భిక్షుకత్వాన్ని, వృద్ధిచేసేందు కివి. కాని వాటి కెటు వంటి ఘనమైన పేర్లు కల్పించారు? మాతృభూమి, భూత దయ, మతోద్ధరణము, సంఘాభివృద్ధి, సంస్కారము, సంస్కరణము, ప్రజాసేవ, పవిత్రవిధి, నైతికాదేశము, వారసపుహక్కులు, ఆస్తిహక్కులు, సంసారహక్కులు, నిర్మల ప్రేమ, ఇట్లా—నాకు గొప్ప మాటలలో నమ్మకం పోయింది. తియ్యని అభిమానపు పలుకుల్ని ఎవరన్నా పలికాడా, వాడు శుద్ధచోరుడు. జాగ్రత్త. మోసగాడు తన వేపిరిగొట్టుతనాన్ని పిసిరిగొట్టుతనాన్ని, కామాన్ని యీ మాటలకింద మరుగు పరచాలని చూస్తున్నాడు. ఎంత వున్నతమైన జన్మ నెత్తిన మనుష్యుడు, ఎంత అధముడై పోయినాడు? నిరంతర ప్రమోదానికి, విశాలమైన స్వేచ్ఛా ప్రేమలీలకు,

హక్కుదారై, జన్మించిన మనుష్యుడు—అంత విహీనమై యీ సృష్టికి అధిపతి-బిడ్డపైన, కుక్కపైన, ఆకాశంపైన, సుందరమైన యీ భూమిపైన, మనుష్యులపైన సుందరమైన ప్రాతఃకాలాలూ, సాయంకాలాలూ కల్పించే ఈ ఆకాశం పైన, ప్రేమకై జన్మించాడు. కాని అబద్ధంతో కుళ్ళి ఎడతెరపిలేని యాచకత్వంలో క్షుద్రుడై పోయినాడు.

(రష్యన్‌నుంచి అనువాదం.)

